# సినిమాలతో బిజీ అయిన బాక్సర్

ఒక రంగంలోని వారు మరో రంగం పట్ల ఆకర్షితులు కావడమో, అభిరుచితో అందులోకి ప్రవేశించడం అనేది ఎప్పట్నుంచో చూస్తున్నదే. ముఖ్యంగా సినిమారంగంలోని వారు క్రీడల పట్ల, క్రీడాకారులు సినిమారంగం పట్ల మక్కువ చూపుతున్న విషయం తెలియందికాదు. గతంలో పరుగులరాణిగా మనదేశ కీర్తిని చాటిచెప్పిన అశ్వనీనాచప్ప కూడా సినిమా రంగంలోకి ప్రవేశించి 'అశ్వని', 'ఇన్‌స్పెక్టర్ అశ్వని', 'ఆదర్శం' వంటి కొన్ని చిత్రాలలో ప్రధాన పాత్రలను పోషించిన సంగతి గుర్తుండే ఉంటుంది. ఇక ప్రముఖ క్రికెటర్ అజారుద్దీన్ కూడా తన బయోగ్రఫీతో ఓ సినిమాను నిర్మించారు. మరో క్రికెటర్ శ్రీశాంత్ హీరోగా మారి సినిమాలను చేస్తున్నారు. ఇక సినిమా తారలు సెలబ్రిటీ క్రికెట్ లీగ్ (సీసీఎల్) పేరుతోనూ, సెలబ్రిటీ బాడ్మింటన్ లీగ్ (సీబీఎల్) పేరుతోనూ క్రీడల వైపు దృష్టి సారించిన వైనం వేరుగా చెప్పనక్కరలేదు. ఇంకా ఎందరో క్రీడాకారులు, సినిమా తారలు ఒకరికొకరు స్నేహపూర్వకంగా మెలుగుతూ ముందుకు సాగుతున్న నేపథ్యంలో బాక్సర్‌గా అందరి దృష్టిని ఆకర్షించిన రితికాసింగ్ కూడా సినిమా రంగంలోకి నటిగా అడుగుపెట్టి బిజీ అవుతుండటం విశేషం. బాక్సింగ్ క్రీడా నేపథ్యంలో హిందీ, తమిళ భాషలలో రూపొందిన 'సాలా ఖడ్దూస్' అనే చిత్రానికి మంచి ఆదరణ లభించడంతో ఇప్పుడు ఆ చిత్రం తెలుగులో కూడా రూపు దిద్దుకుంటోంది. వెంకటేష్ కథానాయకుడిగా నటిస్తున్న ఈ చిత్రంలో హిందీలో పోషించిన బాక్సర్ పాత్రనే రితికాసింగ్ పోషిస్తోంది. తొలి చిత్రమే విజయాన్ని సాధించడంతో పాటు జాతీయ అవార్డును కూడా అందుకోవడంతో ఇటు తెలుగు, అటు తమిళ చిత్రాలలో ఆమెను వెతుక్కుంటూ అవకాశాలు వస్తున్నాయి. దాంతో సినీరంగానికి ఆమె మరింత ప్రాధాన్యాన్ని ఇవ్వక తప్పడం లేదట. తమిళంలో విజయ్ సేతుపతికి జంటగా ఆమె నటిస్తున్న 'ఆండవన్ కట్టళై' చిత్రం చివరిదశకు చేరుకుంది. ఇందులో మహిళా రిపోర్టర్‌గా తన పాత్ర మలచబడిందని రితికాసింగ్ చెప్పుకొచ్చారు. ఈ పాత్ర చేయడానికి ముందు కొన్ని టీవీ ఛానళ్ల రిపోర్టర్లు వృత్తిరీత్యా ఎలా వ్యవహరిస్తారన్న అంశాన్ని ఎంతో కుతూహలంగా పరిశీలిం చానని ఆమె వివరించారు. తొలి చిత్రంతోనే జాతీయ అవార్డు లభించడాన్ని అదృష్టంగా భావిస్తున్నానని, దీంతో ఎలాంటి పాత్ర చేసినా దానికి నూరుశాతం న్యాయం చేకూర్చాలన్న బాధ్యత తనపై మరింతగా పెరిగిందన్న అభిప్రాయాన్ని వ్యక్తంచేశారు. ఈ చిత్రం తర్వాత పి.వాసు దర్శకత్వంలో లారెన్స్‌కు జంటగా నటిస్తున్నానని ఆమె వెల్లడించారు. ఎవరి కెరీర్ ఎప్పుడు ఎలా మలుపు తిరుగుతుందో ఎవరూ చెప్పలేరు. అందుకు రితికాసింగ్‌నే ఓ ఉదాహరణ.



# ఆదివారం ఆంధ్రప్రభ

## లోపలి పేజీల్లో...



"ఉద్వేగం, ఆవేశం ప్రబలమైనప్పుడు వివేకం, విజ్ఞత మరుగున పడిపోతాయి"

- జార్జ్ వాషింగ్టన్





ఆంధ్రప్రదేశ్ అలనాటి అపురూప శిల్పాలు, పచ్చటి సుందర ప్రకృతి దృశ్యాలకు నిలయం. ఆంధ్రప్రదేశ్‌లోని 13 జిల్లాలలో ఉన్న అనేక పర్యాటక ప్రాంతాలను అభివృద్ధి చేయాలనే సంకల్పంతో రాష్ట్ర ప్రభుత్వం ఉంది. ఇక్కడున్న తిరుమల తిరుపతి, ద్వారకా తిరుమల (చిన్న తిరుపతి), శ్రీశైలం, శ్రీకాళహస్తి, సింహాచలం, అన్నవరం, అహోబిలం, మహానంది, కాణిపాకం, విజయవాడ కనకదుర్గ గుడి, గుణదల మేరీమాత, గౌరీపట్నంలోని నిర్మలగిరిమాత ఇవన్నీ ఎంతో ఘనచరిత్ర కలిగినవే. ప్రతి దేవాలయం, ప్రతి కొండ, ప్రతి నది వెనుక మహోన్నత చరిత్ర ఉంది. అంతేకాదు చిత్తూరు జిల్లాలోని తిరుమల తిరుపతి దేవస్థానం ప్రపంచంలోనే ఐశ్వర్యవంతమైన హిందూ దేవాలయం. ఇవేకాకుండా పంచారామాలు, బౌద్ధారామాలతో అలరారుతోంది ఆంధ్రప్రదేశ్. విశాఖపట్నం, భీమిలి, రిషికొండ, పేరిపాలెం, గొల్లపాలెం, మచిలీపట్నం, కాకినాడవంటి ఎన్నో సముద్రతీరాలు, పాపికొండలు, బొర్రాగుహలు, అరకులోయ, లంబసింగి, కోనసీమలాంటి సహజ సుందర ప్రదేశాలు అలరారుతోంది ఆంధ్రప్రదేశ్. వీటన్నిటి అభివృద్ధితోపాటు ఇంకా అనేక ప్రాంతాలను అభివృద్ధి చేసి రాష్ట్రాన్ని పర్యాటకహబ్‌గా తీర్చిదిద్దబోతోంది. టెంపుల్ టూరిజం, ఎకో టూరిజం, ఇంటిగ్రేటెడ్ టూరిజం, బ్యూటిఫికేషన్‌ల పేరుతో పర్యాటక రంగం అభివృద్ధి చేయాలనే కలలతో ముందడుగువేస్తోంది.ఈనెల 27వ తేదీన ప్రపంచ పర్యావరణ దినోత్సవం సందర్భంగా రాష్ట్రంలోని 13జిల్లాలలో ప్రస్తుతం ఉన్న సందర్శనీయ ప్రాంతాలలో ఓసారి విహరిద్దాం-

## ● మీ మెయిల్

### వివరణాత్మక సమాచార కథనం

ఈ వారం 11, సెప్టెంబర్, 2016 ఆదివారం అనుబంధంలో కమ్యూనికేషన్స్‌రంగాన్ని ఒకుదుపు కుదిపేస్తున్న జియో సిమ్స్ గురించి అందించిన కథనం సందర్భోచితంగా ఉంది. అద్భుతాల ఆలయం లో మహాదేవ్ మందిరం శివదేవునిఆలయం గురించి చాలావిషయాలు తెలుసుకున్నాం. మాకు తెలి యని ఎన్నో విషయాలను మీకు తెలుసా? ద్వారా తెలుసుకుంటున్నాం. సాహితీపేజీ సూపర్. ఓనమ్ పండగ విశేషాలు బాగున్నాయి. ప్రభ వీక్లీకోసం మేమంతా ప్రతీ సండే ఎదురుచూస్తుంటాం. ఇటువంటి మంచి విషయాలను మాకు తెలియజేస్తున్న ఆదివారం ఆంధ్రప్రభకు ధన్యవాదములు.




- శ్రీరామ్ సబ్బిశెట్టి, వేములపాలెం

### విశిష్టపండగ 'ఓనం'

ఈ వారం సెప్టెంబర్11, 2016 ఆదివారం అనుబంధం సెంటర్ స్ప్రెడ్‌లో 'ఐకమత్యానికి ప్రతీక' అనే శీర్షికతో కేరళ రాష్ట్రంలో ఆగస్ట్ చివరలోగాని సెప్టెంబర్ లోకాని వచ్చే ఓనం పండగ గురించి ఇచ్చారు. కేరళ రాష్ట్రంలో ఈసమయం లో ఎక్కడ చూసినా పెద్ద ఎత్తున పండగవాతావరణం కన్పిస్తుంది. అందరూ ఒక కుటుంబంలా కలిసికట్టుగా తమ సాంప్రదాయ ప్రకారం ఆడవారు తెల్లటి చీరలు, మగవారు తెల్లటి పంచె, తెల్లటి చొక్కా పైన కండవా వేసుకొంటారు. ఓనం పదిరోజులు కేరళీయులు ఎక్కడ ఉంటే అక్కడ పండగ సందడి నెలకొంటుంది. ఓనం ప్రత్యేకతలు గురించి బావున్నాయి. మంచి విషయాలను తెలియజేసిన ఆంధ్రప్రభ ఎడిటర్ గారికి అభినందనలు.

- పట్నాల సూర్యనారాయణ, రాజమండ్రి

### చదివించే కథనాలు

ఈ వారం సెప్టెంబరు11,2016 ఆదివారం అనుబంధంలో చిన్నారిపేజీలో 'డబ్బు కాసే చెట్టు కథ'చదివి చెట్లకు డబ్బులు కాయడం సామెత అనే వివరాన్ని తెలుసుకున్నాం. యాత్ర పేజీలో అద్భుతాల ఆలయం శీర్షికతో గుజరాత్ రాష్ట్రంలో భావనగర్ జిల్లా కొలియాక్ గ్రామసమీపంలో ఉన్ననిష్కలంక మహాదేవ్ ఆలయం గురించి ఇచ్చిన వివరాలు బాగున్నాయి. సాహితీలో 'పదనిస' కవిత ఒకమోస్తరుగా ఉంది. 'పదం పుట్టింది కలంలోంచా, కలం పట్టిన చేతిలోంచా' రెండు వాక్యాలు బావున్నాయి. శర్మగారి జవాబులు ప్రతివారం ప్రచురించవలసిందిగా కోరుతున్నాను.

-పి.ఎస్, కాకినాడ


**మీ అభిప్రాయాలు కింది చిరునామాకు తెలియజేయగలరు.**

ది ఎడిటర్, ఆంధ్రప్రభ ఆదివారం అనుబంధం
జూబ్లీహిల్స్ చెక్‌పోస్ట్,హైదరాబాద్ - 500033.
ఇ-మెయిల్ ఐ.డి.: sundayprabha@gmail.com


కావేరి జల వివాదం
కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు


పుస్తక రచన
రాజకీయాలు
సినిమాలు
పవన్
?


నయీం దందా కేసులు
ఇరకాటంలో నేతలు
నయీం దందాలు


చంద్రులిద్దరూ జలాల చర్చలో
నిండా మునిగి ఉన్నారండీ...

# సత్యావిష్కరణ

సంఘటన ఒకటే. దానికి సాక్షులు ఎందరో. కానీ ఒకో సాక్షి ఆ సంఘటనను తనకే ప్రత్యేకమైన దృక్కోణంలోంచి చూస్తాడు. అర్థం చేసుకుంటాడు. ఏ ఒక్కరి కథనం మరొకరి కథనంతో పోలదు. మూల సంఘటన ఒకటే అయినా దాన్ని చూసే వారిని బట్టి సంఘటన రంగు మారుతుంది. రూపు మారుతుంది.

నిత్యజీవితంలో ఇది అందరికీ అనుభవమే. ఒక మామూలు సంఘటన, కళ్ల ముందు జరిగిన సంఘటనలేనే ఇన్ని రకాల కథనాలు, అపోహలు, దుర్వ్యాఖ్యానాలు ఉంటే ఋషులు అత్యంత తీవ్రమైన ఆధ్యాత్మిక సత్యావిష్కరణ అనుభూతిని పొంది, ఆ అలౌకిక అనుభూతిని సామాన్య భౌతిక ప్రపంచస్థాయికి దింపి, ప్రపంచానికి అందిస్తూంటే, అంత భావావేశం, తీవ్రానుభూతి, సత్యదర్శన తపన లేనివారు ఆ మంత్రార్థాన్ని సరిగా అర్థం చేసుకోవటమే కష్టం. ఇక దానిలో దాగి ఉన్న గూఢార్థాలను, సత్యాలను గ్రహించటం కుదరని పని. వేదమంత్రాల విషయంలో అందుకే పాశ్చాత్యుల వివరణలను తీర్మానాలను ఆమోదించటం కష్టం.

సరమా, పాణిల కథను పాశ్చాత్యులు వివరించిన విధానం ఇలాంటిదే. 'గ్రిఫిత్' అనే పాశ్చాత్య పండితుడు సరమాను దేవదూతగానో, ఇంద్రుడి దూతగానో భావించాడు. పాణిలు, రాక్షసులనీ, వారు ఆవులనో, వెలుతురునో ఎత్తుకుపోయారనీ, ఇంద్రుడు ఆ ఆవులనో, వెలుతురునో తిరిగి పొందాలని ఆశిస్తున్నాడనీ సరమా సంఘటనపై వ్యాఖ్యానించాడు.

'మెక్‌డొనెల్' అనే మరో పాశ్చాత్య పండితుడు. పాణిలకు చెందిన గోవులను ఇంద్రుడు కాజేయాలని చూస్తున్నాడని, పాణిలు ఆ ఆవులను నదిఆవల ఉన్న గుహలో దాచిపెట్టారని, ఇంద్రుడి దూత అయిన 'సరమా' ఆ ఆవులు ఎక్కడున్నాయో తెలుసుకుని, గుహ జాడ కనిపెట్టి ఇంద్రుడికి తెలిపిందనీ ఆ కథను అర్థం చేసుకున్నాడు.

అంటే ఒకే కథను ఇద్దరు పాశ్చాత్య పండితులు, రెండు రకాలుగా అర్థం చేసుకున్నారన్నమాట. ఒకరు పాణిలకు చెందిన పశు సంతతిని ఇంద్రుడు కాజేయాలనుకుంటున్నాడంటే, మరొకరు పాణిలు ఎత్తుకుపోయిన ఆవులను ఇంద్రుడు పొందాలని ప్రయత్నిస్తున్నాడని అర్థంచేసుకున్నాడు. తమ వాదనను సమర్థిస్తూ వారు ఆదిమ కాలంలో మనుషులు పశువులనే ధనంగా భావించేవారనీ, వాటికోసమే యుద్ధాలు జరిగేవనీ వ్యాఖ్యానించారు. మహాభారతంలో విరాటుడి పశువులను కౌరవులు కాజేయటాన్ని ఉదాహరణగా చూపుతూ వేదంలోనూ ఇలాగే జరిగిందని తీర్మానించారు. మరో పండితుడు పాణిలు అన్నపదం వ్యాపారులను సూచిస్తుందనీ, ఎలాగయితే వ్యాపారులు వస్తువులను దాచి కృత్రిమ కొరత సృష్టించి నల్లబజారును నడుపుతుందో, అలాగే ఆ కాలంలో పాణిలు గోవులను దాచేశారనీ, ఇప్పటి పోలీసులు క్రమంగా దాచిన వస్తువులను వెతికి పట్టుకునేట్టు, అప్పటి సరమా ఆ పనిచేసిందని నిర్ణయించేశాడు.

డిడికోశాంచి అనే భారతీయ పండితుడు, పాణిలు ఆవులను దొంగిలించ లేదనీ, ఇంద్రుడే సరమా ద్వారా వాటిని తనకు 'కప్పం'గా చెల్లించమని డిమాండ్ చేశాడనీ, పాణిలు అందుకు ఒప్పుకోకపోతే వారిని బెదిరించాడనీ అభిప్రాయపడ్డాడు. అంటే ఒక ఆధ్యాత్మిక సత్యాన్ని ఆవిష్కరించే మంత్రం దాన్ని చూసే దృష్టి అర్థం చేసుకునే మేథ మారటంతో మామూలు స్థాయికి దిగజారిందన్నమాట. చివరికి, ఈ మంత్రానికి మరో అర్థం ఉందనీ, అది అత్యంత అద్భుతమైన ఆధ్యాత్మిక సత్యాన్ని ఆవిష్కరిస్తుందనీ ఎవరైనా అంటే వారిని హేళన చేసే పరిస్థితులు నెలకొన్నాయి. భారతీయ శాస్త్రాలు, విజ్ఞానం, చరిత్ర, సంస్కృతి సర్వం ఈ రకమైన అపోహలకు, దురూహలకు, దుర్వ్యాఖ్యానాలు గురయ్యాయి.

ఆధునిక కాలంలో వేదఋషిలాంటివాడు అరబిందో. అరబిందో మహర్షి 'సీక్రెట్ ఆఫ్ వేద'లో సరమా కథను ఆధ్యాత్మిక దృష్టితో దర్శించి, వేదఋషులు పొందుపరచి సత్యాన్ని ఆవిష్కరించారు. వేదమంత్రాలపైపై అర్థాలను, మాత్రమే పరిగణనలోకి తీసుకుని, మనకనుభవమున్న వాటి ఆధారంగానే వేదాన్ని వివరించాలని ప్రయత్నిస్తే కలిగే అపోహలు, అనర్థాలను ప్రపంచానికి ప్రదర్శించాడు.

పాశ్చాత్యులు తమ అనుభవాన్ని అనుసరించి తెగలు, తెగల నడుమ పశువుల కోసం పోరాటాలుగా ఇచ్చిన అర్థాన్ని ఆయన తిరస్కరించారు. తపస్సు ద్వారా దర్శించిన సత్యాన్ని ప్రపంచానికి ప్రకటించారు.

సరమా, పాణిలు గోవులను గుహలో దాచటాన్ని చీకటి నుంచి వెలుతురు కోసం ప్రయాణంలా, చీకటి, వెలుతురుల నడుమ ఘర్షణలా అభివర్ణించారు. చీకటి అజ్ఞానం. వెలుగు విజ్ఞానం. వెలుగు చీకటి గుహలో ఉంది. ఆ వెలుగు జాడను కనుగొన్నది సరమా. సరమా అన్నది మనిషి మేధ లోని అంతర్ విజ్ఞానం లాంటిది. Intuition మనిషికి ఎవ్వరూ చెప్పకుండానే మంచి ఏమిటో, చెడు ఏమిటో మనసులోనే తెలిసిపోతుంది. ఇంకా పూర్తిగా ఊహ ఎదగని పిల్లల్లో కూడా మంచి, చెడు భావనలు ఉంటాయి. మంచి, చెడు అన్న పదాలు, వాటి అర్థాలు తెలియకుండానే. ఏదైనా చెడు పనిచేయగానే అపాలజిటిక్‌గా చూస్తాడు. పెద్దల కోపాన్ని కరిగించటానికి మనోహరంగా నవ్వనివాడు లేకపోతే ఏడుస్తాడు. కానీ, వాటన్నిటి వెనుక తనకు తెలియకుండానే తాను చేసింది తప్పు అన్న జ్ఞానం ఉండటం. అదే నడక నేర్చేటప్పుడు ఒక అడుగు వేసి గర్వంగా చూస్తాడు. అది మంచి పని అని, గొప్ప అనీ ఎవ్వరూ చెప్పకుండానే ఏదో సాధించినట్టు కేరింతలు కొడతాడు. అంటే మనిషిలోని Intuitive power అంతశ్శక్తి అతడికి అజ్ఞానాన్ని ఇస్తుందన్నమాట. అలాంటి జ్ఞానం 'సరమా' అంటారు అరబిందో.

'సరమా' గోవులు లేక వెలుతురు ఎక్కడ దాగున్నాయో కనుక్కుంటుంది. ఆ విషయం ఇంద్రుడు అంటే పరిణతి పొందిన మేథకు తెలుపుతుంది. దాని పని అంతే. ఆ తరువాత అది చూపిన దారిలో ప్రయాణించి విజ్ఞానపు వెలుతురును సాధించటం మనిషి పని. సరమా చూసిన దారిలో



ప్రయాణించి విజ్ఞాన సాధన కోసం వ్యక్తి శ్రమపడాలి. ప్రయత్నించాలి. కష్టపడాలి. ఈ నిజాన్ని అరబిందో మరింత స్పష్టంగా వివరించారు.

'She is a power descended from the super conscient truth which leads us to the light that is hidden in ourselves, in the subconscious'

ఇప్పుడు సరమా కథ సంపూర్ణంగా మారిపోయి నూతన వెలుతురులో దర్శనమిస్తుంది. ఇక్కడ వెలుగు దాగి ఉన్న మనిషి. తనలో ఉన్న వెలుతురును అంటే విజ్ఞానాన్ని, దివ్యజ్యోతిని సాధించటం మనిషి పని. ఆ వెలుగు దాగి ఉన్న స్థలం, దానికి దారి చూపేది అనంతం నుంచి దిగి వచ్చిన చైతన్యం. ఆ చైతన్యం మనిషి ఉపచేతనలో దాగి ఉన్న సత్యానికి దారిచూపిస్తుంది. ఇక్కడ రాక్షసులు లేరు. ఆదిమజాతులు లేవు. ఆవులు ఎత్తుకుపోవటం లేదు. పశుధనం కోసం పోరాటాలు లేవు. దాన్ని వెతికే వేట కుక్క లేదు. ఉన్నది ఒకటే సత్యం. 'తమసోమా జ్యోతిర్గమయ' చీకటి నుండి వెలుతురుకు ప్రయాణం తన అసలు స్వరూపాన్ని మనిషి గ్రహించటం! అదే విజ్ఞానం. అదే వేదం.

- కస్తూరి మురళీకృష్ణ
సెల్ నెం. 98496 17392

అత్యాశ గల వాడికి సంతృప్తి లేదు. సంతృప్తి లేని వాడికి సంతోషం లేదు ●

# వీసా లేకుండా వెళ్లవచ్చు

ప్రపంచీకరణ పుణ్యమా అని ప్రపంచమంతా ఓ కుగ్రామంగా మారిపోయింది. ఇంటర్నెట్ పుణ్యమా అని అన్ని ప్రాంతాలను అరచేతిలోనే చూసుకునే భాగ్యం కలిగింది. అయినా కూడా ఏమాత్రం సమయం దొరికినా దేశవిదేశాల్లో విహరించాలనే తహతహ నేడు బాగా పెరిగింది. దానికి తోడు ఐక్యరాజ్యసమితి ప్రతి సంవత్సరం సెప్టెంబర్ 27వ తేదీని 'వరల్డ్ టూరిజం' డేగా సెలబ్రేట్ చేస్తూ ఒక్కొక్క సంవత్సరం ఒక్కొక్క థీమ్‌తో జరుపుతున్నారు. ఈ సంవత్సరం 'టూరిజం ఫర్ ఆల్' థీమ్‌తో జరుపుకోబోతున్నాం. ఈ సందర్భంగా వీసాల్లేకుండా మనం వెళ్లగలిగిన దేశాలు, ఆన్‌అరైవల్ వీసాలు పొందగలిగిన దేశాల జాబితా మీకోసం.

మనదేశం నుండి వేరే దేశానికి వెళ్లాలంటే ముందుగానే వీసా (పర్మిషన్) తీసుకోవాల్సి ఉంటుంది. అమెరికా, ఆస్ట్రేలియా, బ్రిటన్, యూరప్, సింగపూర్ లాంటి దేశాలకి వెళ్లాలంటే ఇక్కడ ఆ దేశానికి సంబంధించిన ఆఫీస్‌లకి వెళ్లి సరైన పత్రాలు చూపించి, ఇంటర్వ్యూలో అడిగే ప్రశ్నలకి సరైన సమాధానాలు చెప్పాల్సి ఉంటుంది. మనం వాళ్ల దేశానికి ఎందుకు వెళ్తున్నామో, ఎన్ని రోజులు ఉంటున్నామో ఖచ్చితంగా చెప్పాల్సి ఉంటుంది. మన సమాధానాలు అక్కడి అధికారులకి నచ్చితేనే మనకి వీసా జారీచేస్తారు. కానీ కొన్ని దేశాలకి మన పాస్‌పోర్ట్‌తో నేరుగా వెళ్లిపోవచ్చు. ఎటువంటి వీసా అక్కర్లేదు. ఆ దేశపు విమానాశ్రయంలో దిగిన వెంటనే వీసా ఇచ్చేస్తారు.



**ఇండియా నుంచి వీసా లేకుండా వెళ్లగలిగే దేశాలు 26 ఉన్నాయి. అవి-**

భూటాన్, బ్రిటిష్, వర్జీనియా ద్వీపాలు, కుక్ ద్వీపం, డొమినికా, ఈక్వెడార్, ఎల్‌సాల్వడార్, ఫిజీ, గ్రెనడా, హైతీ, జమైకా, కిష్ ద్వీపం, మకావూ, మారిషస్, మైక్రోనేషియా, మాంట్‌సెరాట్, నేపాల్, నైవూ, పాలస్తీనా, పిట్‌కైర్న్ ద్వీపాలు, సెయింట్ కిట్స్ అండ్ నేవీస్, సెయింట్ విన్సెంట్ అండ్ గ్రెనెడినెస్, దక్షిణ ఒసేటియా, ట్రాన్స్‌నిస్ట్రియా, ట్రినిడాడ్ అండ్ టొబాగో, టర్క్స్ అండ్ కైకోస్ ద్వీపాలు, వనాటూ.

● మనిషి అన్నవాడు 'మంచి'ని మరచుట, ఆత్మవంచనే అవుతుంది

**ఆ దేశంలో అడుగు పెట్టాక వీసా ఇచ్చే దేశాలు 34**

అవి-

బహ్రెయిన్, బొలీవియా, బురుండి, కాంబోడియా,కేప్ వెర్డ్, జిబౌటీ, ఇథియోపియా, గినియా- బిసావూ, గయానా, హాంకాంగ్, ఇండోనేషియా, జోర్డాన్, కెన్యా, లావోస్, మడగాస్కర్, మలేషియా, మాల్దీవులు, మొజాంబిక్, నౌరూ, పలావూ, సెయింట్ లూసియా, సమోవా, సీచెల్స్, సోమాలియా, సోమాలీలాండ్, శ్రీలంక, తజకిస్థాన్, టాంజానియా, థాయ్‌లాండ్, తిమోర్-లెస్టే. టోగో, తువాలూ, ఉగాండా, వియత్నాం.

**వీసా ఎన్ని రోజుల్లో పొందగలరు?**

● బొలీవియా- ఈ దేశానికి వెళ్లగానే వీసా ఇస్తారు. 90 రోజులు గడువుంది.

● ఇండోనేషియా- ఈదేశానికి వెళ్లగానే 30 రోజులకు వీసా ఇస్తారు.

● ఆండోరా- ఈ దేశానికి భారతీయులు వీసా లేకుండా వెళ్లి ఎన్ని రోజులైనా ఉండవచ్చు.

● మారిషస్-ఈ దేశానికైతే అసలు వీసానే లేకుండా 90 రోజులుండవచ్చు.

● కేప్‌వెర్డే-ఈ దేశానికి వెళ్లగానే వీసా ఇస్తారు. గడువు లేదు.

● జోర్డాన్- అక్కడకు వెళ్లగానే రెండు వారాలకు వీసా ఇస్తారు. కానీ చేతుల్లో 3000అమెరికన్ డాలర్లు ఉండాలనే నిబంధన ఉంది.

● కెన్యా- ఈదేశానికైతే వెళ్లిన వెంటనే ఇస్తారు. దాంతో మూడు నెలలు అక్కడ ఉండవచ్చు.

● ఫిజీ-ఈ దేశానికి అసలు వీసా లేకుండా నాలుగు నెలలు ఉండవచ్చు.

● సోమాలియా- అక్కడికి వెళ్లగానే ఇస్తారు. కానీ అక్కడికి వెళ్లడానికి రెండు రోజుల ముందుగానే మిమ్మల్ని ఆహ్వానించిన వారు అక్కడి విమానాశ్రయంలో దరఖాస్తుని సమర్పించాలి.

● పలావ్- ఈదేశానికి వెళ్లగానే 30రోజులకు వీసా ఇస్తారు.

● సీషెల్స్-ఈ దేశానికి వెళ్లగానే 30రోజులకు అనుమతి పత్రం ఇస్తారు.

● హైతీ- ఈ దేశంలో అసలు వీసా లేకుండా 3 నెలలు ఉండవచ్చు.

● గునియా బిస్సావ్- ఈ దేశానికి వెళ్లగానే 90రోజులకు వీసా ఇస్తారు.

● డామినికా- ఈ దేశానికి వెళ్లగానే 6 నెలలకు వీసా ఇస్తారు.




● నౌరూ- ఈ దేశానికి వెళ్లగానే ఇస్తారు. గడువు లేదు.

● జమైకా- ఈ దేశానికి వీసా అక్కర్లేదు. గడువు కూడా లేదు.

● ఈసల్వడార్- ఈదేశంలో అసలు వీసా లేకుండా 90 రోజులు ఉండవచ్చు.

● సెయింట్ లూసియా- ఈ దేశానికి వెళ్లగానే ఇస్తారు. 6 వారాలు గడువు.

● మడగాస్కర్- ఈదేశానికి వెళ్లగానే 90రోజులకు అనుమతిస్తూ వీసా ఇస్తారు.

● సమో- ఈదేశంలో వీసా లేకుండానే 30రోజులు ఉండవచ్చు.

● లావోస్-ఈ దేశానికి వెళ్లగానే 30రోజులకు వీసా ఇస్తారు.

● మాల్దీవులు- ఈదేశానికి వెళ్లగానే ఇస్తారు. 90రోజులు గడువు.

● మైక్రోనేషియా- అక్కడకు వెళ్లగానే ఇస్తారు. 30రోజుల గడువు.

● శ్రీలంక- ఎలక్ట్రానిక్ ట్రావెల్ ఆథరైజేషన్ అనే పద్ధతి అనుమతిస్తారు. గడువు 30రోజులు.

● నేపాల్- ఈ దేశానికి వెళ్లాలంటే పాస్‌పోర్టు కూడా అక్కర లేదు. ఒక గుర్తింపు పత్రం ఏదైనా ఉంటే చాలు. అంతేకాక ఆ దేశానికి వచ్చే భారతీయులు స్వేచ్ఛగా తిరగడమే కాక అక్కడ జీవించవచ్చు కూడా.

● టాంజానియా- వీసా అక్కడకు వెళ్లగానే ఇస్తారు. గడువు లేదు.

● కంబోడియా- అక్కడకు వెళ్లగానే 30రోజులకు వీసా ఇస్తారు.

● భూటాన్- అక్కడకు వెళ్లాలంటే వీసా అక్కరలేదు. గడువు కూడా లేదు. ఈదేశాలలో చూడటానికి, పర్యటించడానికి ప్రత్యేక ప్రాంతాలు, సముద్రతీరాలు ఉన్నాయి. ఈ దేశాలలో పర్యటించడం తక్కువ ఖర్చుతో కూడుకున్న పని. మీరు ఈసారి టూర్‌కి వెళ్లాలనుకున్నప్పుడు ఈ దేశాల గురించి కూడా ఆలోచించండి. ●



మంచిలో జీవించుటయే 'దైవత్వము' ననుభవించుట ●

# ప్రకృతిలో విహారం



ఆంధ్రప్రదేశ్ అలనాటి అపురూప శిల్పాలు, పచ్చటి సుందర ప్రకృతి దృశ్యాలకు నిలయం. ఆంధ్రప్రదేశ్‌లోని 13 జిల్లాలలో ఉన్న అనేక పర్యాటక ప్రాంతాలను అభివృద్ధి చేయాలనే సంకల్పంతో రాష్ట్ర ప్రభుత్వం ఉంది. ఇక్కడున్న తిరుమల తిరుపతి, ద్వారకా తిరుమల (చిన్న తిరుపతి), శ్రీశైలం, శ్రీకాళహస్తి, సింహాచలం, అన్నవరం, అహోబిలం, మహానంది, కాణిపాకం, విజయవాడ కనకదుర్గ గుడి, గుణదల మేరీమాత, గౌరీపట్నంలోని నిర్మలగిరిమాత ఇవన్నీ ఎంతో ఘనచరిత్ర కలిగినవే. ప్రతి దేవాలయం, ప్రతి కొండ, ప్రతి నది వెనుక మహోన్నత చరిత్రఉంది. అంతేకాదు చిత్తూరు జిల్లాలోని తిరుమల తిరుపతి దేవస్థానం ప్రపంచంలోనే ఐశ్వర్యవంతమైన హిందూ దేవాలయం. ఇవేకాకుండా పంచారామాలు, బౌద్ధారామాలతో అలరారుతోంది ఆంధ్రప్రదేశ్. విశాఖపట్నం, భీమిలి, రిషికొండ, పేరిపాలెం, గొల్లపాలెం, మచిలీపట్నం, కాకినాడవంటి ఎన్నో సముద్రతీరాలు, పాపికొండలు, బొర్రాగుహలు, అరకులోయ, లంబసింగి, కోనసీమలాంటి సహజ సుందర ప్రదేశాలు అలరారుతోంది ఆంధ్రప్రదేశ్. వీటన్నిటి అభివృద్ధితోపాటు ఇంకా అనేక ప్రాంతాలను అభివృద్ధి చేసి రాష్ట్రాన్ని పర్యాటకహబ్ గా తీర్చిదిద్దబోతోంది. టెంపుల్ టూరిజం, ఎకో టూరిజం, ఇంటిగ్రేటెడ్ టూరిజం, బ్యూటిఫికేషన్‌ల పేరుతో పర్యాటక రంగం అభివృద్ధి చేయాలనే కలలతో ముందడుగువేస్తోంది.

-ఈనెల 27వ తేదీన ప్రపంచ పర్యావరణ దినోత్సవం సందర్భంగా రాష్ట్రంలోని 13జిల్లాలలో ప్రస్తుతం ఉన్న ప్రకృతిమాత ప్రాంతాలలో ఓసారి విహరిద్దాం-



# చక్కటి అనుభూతినిచ్చే ప్రదేశాలు



ఆంధ్రప్రదేశ్‌లోని మూడవ అతిపెద్ద నగరంగా విలసిల్లుతోన్న విజయవాడ ఓ చక్కని పర్యాటక ప్రదేశంగా వర్ధిల్లుతోంది. ఈ నగరంలో ఇంద్రకీలాద్రి కొండపై కొలువై ఉన్న కనకదుర్గమ్మ ఆలయం విజయవాడ నగరానికే తలమానికం. కృష్ణాజిల్లాలోని కృష్ణానది ఒడ్డున కొలువైన విజయవాడ నగరంలో చూడచక్కని ప్రదేశాలు అనేకం ఉన్నాయి.

విజయవాడ నగరంతోసహా దానికి చుట్టూ ఉన్న ఇతర ప్రాంతాల్లో సైతం అనేక పర్యాటక ప్రదేశాలు ఉన్నాయి. వీటిలో ముఖ్యమైనవాటిగా కొన్నింటిని చెప్పవచ్చు. విక్టోరియా మ్యూజియం, ప్రకాశం బ్యారేజీ, గాంధీకొండ, ఉండవల్లి గుహలు, మంగళగిరి నరసింహస్వామి ఆలయం, గుణదల మేరీమాత చర్చి, భవానీద్వీపం, అమరావతి, కనకదుర్గమ్మ ఆలయం తదితర ప్రదేశాలు విజయవాడ నగరాన్ని సందర్శించేందుకు పర్యాటకులకు ఓ చక్కని అనుభూతిని అందిస్తాయి.



# కోనసీమ అందాల జిల్లా

అఖండ గోదావరి ప్రవహించిన జిల్లా తూర్పుగోదావరి ఈ జిల్లాలోని కోనసీమ ప్రకృతి అందాలను తిలకించే పర్యాటకుల సంఖ్య పెరుగుతోంది. పచ్చని తివాచీలు పరిచినట్లుండే కోనసీమ విశిష్ట నదీ సంగమ ప్రదేశాలు, అంతర్వేది బలుసుతిప్ప మొగలు, ఓడలరేవు విశేషంగా ఆకర్షిస్తాయి. అంతర్వేది వద్ద విశిష్టానది సముద్రంలో కలిసే సంగమ ప్రదేశాన్ని అన్నాచెల్లెళ్ల గట్టుగా పిలుస్తారు. ఇక్కడ నిర్మించిన లైట్‌హౌస్ ప్రత్యేక ఆకర్షణ. గోదావరి నది ఒడ్డున కూర్చుని సంధ్యాసమయాలను తిలకించటం ఓ గొప్ప అనుభూ తినిస్తుంది. రాష్ట్ర టూరిజం శాఖ ఆధ్వర్యంలో నడిచే హౌస్‌బోట్‌లో గోదావరి లో విహరిస్తూ రోజంతాకోనసీమ అందాలను ఆస్వాదించవచ్చు. ప్రకృతి అందాలతో పాటు గోదావరి గలగలలు, కోనసీమ కొబ్బరిచెట్లు ప్రకృతి ప్రేమికులను మైమరిపిస్తాయి. రాష్ట్ర పర్యాటకశాఖ ప్యాకేజీలు పర్యాటకులకు అందుబాటులో ఉన్నాయి. ఈ ప్యాకేజీలో బోట్‌షికార్‌తోపాటు ముఖ్యమైన దేవాలయాల సందర్శనం ఉంటుంది. పాపికొండల నడుమ గోదావరి అందాలను చూడడం తప్ప ఆ అనుభూతిని వర్ణించటం సాధ్యంకాదు. నేటి బిజీ జీవితాల్లో కాస్తంత సేదతీరటానికి అనుకూలమైన ప్రదేశం. వేసవిలో చల్లదనాన్ని పంచే ప్రాంతం కోనసీమ. ఇంకా అంతర్వేది, అన్నవరం, ద్రాక్షారామం, పవనగిరి దేవాలయం, ద్వారపూడి, తలుపులమ్మ లోవ, సామర్లకోట, పిఠాపురం సందర్శించవలసిన ముఖ్య ప్రదేశాలు.

తెలుగింట జరిగే ప్రతి శుభకార్యంలోనూ శ్రీ సత్యనారాయణస్వామి వ్రతం తప్పనిసరి. అటువంటిది ఆ సత్యనారాయణస్వామి కొలువుతీరిన క్షేత్రమే అన్నవరం. ఈ క్షేత్రం ఆంధ్ర రాష్ట్రంలోని తూర్పుగోదావరి జిల్లాలో ఉంది. రాజమండ్రికి దాదాపు 80 కి.మీ. దూరంలో ఉంది. అన్నవరం స్టేషన్ నుండి 3 కి.మీ. దూరంలో పంపానదీ తీరంలో ఉన్న కొండ రత్నగిరి. ఇక్కడ రత్నగిరిపై వెలిసిన శ్రీ వీరవెంకట సత్యనారాయణస్వామి ఆలయం అన్నవరం సత్యనారాయణ దేవాలయంగా ప్రసిద్ధి చెందింది. ప్రతిరోజూ సామూహిక సత్యనారాయణ వ్రతాలు ఇక్కడ నిర్వహిస్తారు. కొండ కింది నుండి పైకి నేరుగా దేవస్థానం తరపున బస్సులున్నాయి.

# పానకాలస్వామి కొలువైన మంగళగిరి

గుంటూరు జిల్లాలో సందర్శించాల్సిన ప్రదేశాలు అనేకం ఉన్నాయి. కొండవీడు కోట, ఉండవల్లి కేవ్స్, అమరావతి, ఉప్పలపాడు గార్డెన్స్, కోటప్పకొండ, మంగళగిరి ప్రధాన పర్యాటక ఆకర్షణలు. కృష్ణానదీ తీరంలో ఉన్న అపురూపమైన ఆలయం అమరావతి. దీనినే పురాణాల్లో ధాన్యకటకా, ఆంధ్రానగరిగా పేర్కొన్నారు. విజయవాడకు 66 కి.మీ. దూరంలో ఉన్న అమరావతి పురాతన బౌద్ధ స్థూపాలకు చిహ్నంగా చెప్పవచ్చు. దేశంలోని ముఖ్య బౌద్ధస్థలాల్లో ఇదికూడా ఒకటి. శిల్పకళతో పర్యాటక స్థలంగా ప్రస్తుతం అందరినీ ఆకర్షిస్తోంది. ఇక్కడ ఉన్న అమరేశ్వరుని ఆలయంలో మహాశివుడు వివిధ పేర్లతో కొలువుదీరి ఉన్నాడు. సుమారు 15 అడుగుల ఎత్తులో రాతి శివ లింగం ఉంటుంది. చోళరాజులచే నిర్మించిన శ్రీ భావనారాయణస్వామి దేవాలయం, సూర్య లంక బీచ్‌గల బాపట్ల, త్రికూటేశ్వరుని సన్నిధియైన కోటప్పకొండ ఈ జిల్లాలోని ప్రముఖ ఆకర్షణీయ ప్రాంతాలు.



## రాయలు పాలించిన సీమ

రాయలసీమ ప్రాంతాన్ని ఎంతోమంది పరిపాలించినా రాయల పరిపాలనలో చాలా ఖ్యాతి గడించింది. అందుకే ఈ ప్రాంతాన్ని 'రాయల'సీమ అని పిలుస్తారు. ఈ ప్రాంతంలోనే ప్రముఖ పుణ్యక్షేత్రాలైన తిరుపతి, శ్రీశైలం, అహోబిళం, లేపాక్షి, ఒంటిమిట్ట ప్రాంతాలు వెలిశాయి. అంతేగాకుండా ఈ ప్రదేశంలో సినిమా షూటింగులు జరుకునే ప్రదేశాలు, ఆధ్యాత్మిక కేంద్రాలు, విద్యాసంస్థలు ఇలా చెప్పుకుంటూ పోతే ఎన్నో ఈ ప్రాంతంలో ఉన్నాయి. ఈ రాయలసీమ ప్రాంతం ముఖ్యంగా నాలుగు జిల్లాల సమూహం. అవి వరుసగా కర్నూలు, కడప, చిత్తూరు, నెల్లూరు ఈ నాలుగు జిల్లాలలోని ప్రధాన ఆలయాలు, సినిమా షూటింగ్‌లు జరుపుకునే ప్రదేశాలు ఇవి-

## కర్నూలు జిల్లా

పురాతన కట్టడాలు, చారిత్రిక నిర్మాణాలతో పర్యాటకులను అలరిస్తోంది కర్నూలు జిల్లా. శ్రీశైలం, అహోబిలం, మహానంది, యాగంటి, మంత్రాలయం ఉన్నాయి. కర్నూలు జిల్లాలోని ఓర్వకల్లు మండలానికి సమీపాన రాక్ గార్డెన్ ఉంది. ఓర్వకల్లు ప్రకృతి సిద్ధంగా ఏర్పడిన కొండలకు చాలా ప్రసిద్ధి. వీటికి రాక్ గార్డెన్‌గా ఏపి టూరిజం వారు పేరుపెట్టి ఇక్కడ యాత్రికుల సౌకర్యార్థం హోటల్‌ను కూడా నిర్వహిస్తున్నారు. ఇక్కడే మరో అద్భుతం అరుంధతి కోట. ఇది బనగానపల్లె-యాగంటి వెళ్లే దారిలో ఉంది. ఇక్కడే 'అరుంధతి' సినిమా షూటింగ్ చేసారు. ఇక్కడ ఆ సినిమా చేయడం వల్లనే దీనిని అరుంధతి కోటగా ప్రజలు పిలుస్తున్నారు. అలాగే కొండారెడ్డి బురుజుగా పిలిచే కర్నూల్ కోట కర్నూల్ నగరంలో ఎంతో ముఖ్యమైన ప్రాంతం.

## కడప జిల్లా

కడప జిల్లా ఒంటిమిట్ట, అమీన్‌పీర్ దర్గా, ఇస్కాన్ టెంపుల్, గండికోట కొండలు, లోయల సుందర దృశ్యం వర్ణనాతీతం. దట్టమైన అడవులు, మనోహరంగా కనిపించే భూతలం మధ్య ఎంతటి బలమైన శత్రువు దాడినైనా ఎదుర్కోవడానికి ఈ కోట అనువుగా ఉంటుంది. చుట్టూ లోతైన లోయలతో, ఎర్రటి గ్రానైట్ శిలలతో ఏర్పడిన దుర్భేధ్యమైన కొండలతో, 300 అడుగుల దిగువన పడమటి, ఉత్తర దిశలలో ప్రవహించే పెన్నా నది జలకళతో ఈ ప్రాంతం కనువిందు చేస్తుంది.





## చిత్తూరు జిల్లా

చిత్తూరు జిల్లాలో తిరుపతి, శ్రీకాళహస్తి, కాణిపాకం చూడవలసిన ప్రముఖమైన పుణ్యక్షేత్రాలు. చుట్టూ ఎత్తయిన కొండలు, దట్టమైన అరణ్యప్రాంతం, మధ్యలో ఓ జలపాతం ఉండి ఎంతో రమణీయంగా ఉండే ప్రదేశం తలకోన జలపాతం. మరో విహార కేంద్రం హార్సిలీహిల్స్. హార్సిటీ కొండలపై ఉన్నటువంటి విహార కేంద్రం కాబట్టి హార్సిలీ హిల్స్ అనేపేరు వచ్చింది. పచ్చని అడవులు, ఔషధ గుణాలుగల చెట్లతో అలరారుతోంది హార్సిటీ హిల్స్. సముద్ర మట్టానికి 1,265 అడుగుల ఎత్తులో హార్సిలీ హిల్స్ ఉంది. ఈ ప్రాంతం సంపెంగపూలకు ప్రసిద్ధి. సంపెంగ సువాసనలతో హార్సలీహిల్స్ కొత్త వాతావరణాన్ని తలపిస్తుంది.

ఆంధ్రప్రదేశ్‌లోనే ప్రసిద్ధిచెందిన చిత్తూరు జిల్లాలోని ప్రముఖ పర్యాటక కేంద్రాలైన తలకోన, ఉబ్బలమడుగు, సదాశివకోన, కైలాసకోనలు పర్యాటకులను ఎక్కువగా ఆకర్షిస్తాయి.

తలకోన: ఆకాశాన్ని తాకినట్టుండే భారీ వృక్షాలు, నింగినేలను ఏకం చేస్తోందా అనిపించే అతిపెద్ద జలపాతాలు, కనుచూపు మేర పచ్చదనం... గలగలపారే సెలయేరు... ఏటి ఒడ్డున కోరిన వరాలిచ్చే సిద్ధేశ్వరుడు... ఇవన్నీ తలకోన సొంతం. వేంకటేశ్వరస్వామి కొలువైన తిరుమల శేషాచల పర్వతాలకు పశ్చిమ కనుమన ఈ సుందర ప్రాంతం ఉంది. నిత్యం పచ్చదనంతో అలరారే ఈ సుందర ప్రాతం భక్తులను, పర్యాటకులను ఎంతగానో ఆకట్టుకుంటుంది. సముద్ర మట్టానికి 700 అడుగుల ఎత్తున ఉన్న ఈ చల్లటి ప్రాంతం వేసవి విడిదిగా ఖ్యాతిచెందింది. ఈ ప్రాంతంలో ఉన్న సిద్ధేశ్వరస్వామి ఆలయం ఎంతో ప్రసిద్ధమైంది. ఈ స్వామిని భక్తితో దర్శిస్తే సంతానం కలుగుతుందని ప్రజలు నమ్ముతారు.

## నెల్లూరు జిల్లా

భారతదేశంలోని ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో దక్షిణ తీర ప్రాంతపు జిల్లా. ఈ జిల్లా ముఖ్య పట్టణం నెల్లూరు. జిల్లాలో పెన్నానది ఒడ్డున ఉన్న రంగనాథ స్వామి వారి ఆలయం, దగ్గరలోనే గొలగమూడిలో ఉన్న వెంకయ్యస్వామి మందిరం, ఉదయగిరికోట, నరసింహకొండ, పెంచలకోన, వెంకటగిరి రాజులకోట, పినాకిని సత్యాగ్రహ (గాంధీ) ఆశ్రమం, పల్లిపాడు, మైపాడు బీచ్, శ్రీహరికోట వద్ద ఉన్న విఖ్యాతిగాంచిన రాకెట్ ప్రయోగ కేంద్రం, శ్రీకామాక్షితాయి ఆలయం జొన్నవాడ, కృష్ణపట్నం రేవు. నేలపట్టు మొదలైన అనేక చూడదగిన ప్రదేశాలు ఉన్నాయి. పులికాట్ సరస్సు 500కి.మీ విస్తరించి ఉన్న ఉప్పు నీటి సరస్సు ప్రముఖమైనది.

## ప్రముఖ పర్యాటక కేంద్రం



విశాఖపట్నం జిల్లా ప్రముఖ పర్యాటక కేంద్రం గా విరాజిల్లు తోంది. ఈ జిల్లాలో బౌద్ధమతం కూడా ప్రముఖంగా ఉంది. అందుకు గుర్తుగా బొజ్జన్నకొండ, శంకరం, తొట్లకొండ వంటి పర్యాటక కేంద్రాలు ఉన్నాయి. ఋషికొండ, రామకృష్ణబీచ్, భీమునిపట్నం వంటి చక్కటి సముద్ర తీరాలు, అనంతగిరి, అరకులోయ, కైలాసగిరి వంటి ఎత్తయిన కొండల ప్రాంతాలు, భీముని పట్టణంలోని సాగర నదీ సంగమ ప్రాంతాలు, బొర్రా గుహలు ప్రసిద్ధి చెందాయి. ప్రాచీనమైన సింహాచలం వంటి దేవాల యాలు, వలసపక్షులు వచ్చే కొండకర్ల ఆవ, తాటిదోనెలలో కొందకర్ల ఆవలో నౌకావిహారం వంటి పర్యాటక కేంద్రాలు ఉన్నాయి.

### ఆంధ్ర ఊటీ

జలపాతాల సవ్వడి, సెలయేళ్ల హోరు... ఎత్తయిన కొండలు, కళ్లు తిరిగే లోయలు, కొండలన్నీ పచ్చని దుప్పటి కప్పుకున్నట్లు, అడవంతా చిలకాకుపచ్చ చీర సింగారించుకున్నట్టు... ఆహా ప్రకృతి అంటే ఇదేనేమో అనిపించేంత అందం. మనసును మరో లోకాల్లోకి తీసికెళ్లే ఆనందానుభూతులు పంచే ప్రదేశం ఏదైనా ఉంది అంటే అది తప్పకుండా అరకు మాత్రమే. విశాఖపట్టణానికి 112 కి.మీ దూరంలో ఉన్న ఈ ప్రదేశానికి ఉన్న ప్రాముఖ్యం అంతా ఇంతా కాదు. ఆంధ్రా ఊటీగా పేరుగాంచిన అరకులోయలో గడిపే ఒక్కరోజైనా ఏళ్ల తరబడి ఆ జ్ఞాపకాలు పదిలంగా ఉండిపోతాయి. విశాఖ నగరానికి తూర్పున ఉన్న కొండల్లో 3200 అడుగుల ఎత్తులో ఉంది. మల్బరీ తోటలు ఇక్కడ ఎక్కువగా ఉంటాయి. పద్మాపురంలో ఉన్న బొటానికల్ గార్డెన్ ను కూడా చూడాల్సిందే. అరకులో చూడాల్సిన వాటిలో మొదటి వరుసలో నిలిచేది గిరిజన మ్యూజియం. గిరిజనుల సంస్కృతీ సంప్ర దాయాలను ఈ మ్యూజియంలో మనం చూడవచ్చు. గిరిజనులు నిత్య జీవితంలో చేసే పనులు, వారు వాడే వస్తువులు, జీవం ఉట్టిపడే శిల్పాలు ఈ మ్యూజియంలో దర్శనమిస్తాయి.

## చారిత్రక సిరిమానోత్సవం

విజయనగరం భారతదేశములోని ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఈశాన్యంలో ఉంది. రాష్ట్రంలోని జిల్లాలన్నిటికంటే విజయనగరం జిల్లా అత్యంత కొత్తది. విజయనగరంలో ప్రముఖ దేవాలయాలు బలిజిపేట వెంకటేశ్వర స్వామి దేవాలయం, శ్రీరామస్వామి వారి దేవస్థానం, రామ తీర్థం, సాలూరు పంచముఖేశ్వర స్వామి దేవాలయం, అత్యంత పర్యాటక ప్రదేశాలు రామతీర్థం, బొబ్బిలి. ఇక్కడ చారిత్రక కోటలు విజయనగరం కోట, బొబ్బిలికోట, కురుపాం కోట, సాలూరు కోట. ఉత్తరాంధ్రలో ప్రసిద్ధి గాంచిన శ్రీ పైడితల్లి అమ్మవారి సిరిమానోత్సవాలు విజయనగరం పట్టణంలో 300ఏళ్లుగా జరుగుతున్నాయి. బొబ్బలియుద్ధం సమయంలో విజయనగర రాజుల ఆడపడుచైన పైడితల్లి ఆత్మాహుతికి పాల్పడి ఇలవేల్పుగా అవతరించినట్లు భావిస్తారు. అప్పటి నుంచి ఆమెను భక్తితో పూజిస్తున్నారు. లక్షలాది మంది భక్తులు దీనికి హాజరవుతారు.

విద్యుశ్శక్తిలేని రోజుల్లో నాటి పురపాలక సంఘం వారు 'మూడు లాంతర్లు కూడలి'లో మూడు వైపులా మూడు హరికేన్ లాంతర్లు ఏర్పాటు చేశారు. రాత్రిపూట నెల్లిమర్ల, ధర్మపురి, గంటస్తంభం దారులలో ఎడ్ల బళ్లలో వెళ్లేవారికి, పాదచారుల సౌకర్యార్థం నెలకొల్పారు. విజయనగర రాజులు 'అమృత ఖానా'ను పెద్ద పూలకోటలో నిర్మించారు. ఇది గంటస్తం భం నమూనాలో ఉన్నది. పైభాగంలో స్నానానికి అనువుగా పెద్ద తొట్టె ఉన్నది. క్రింది భాగంలో నుయ్యి, దిగడానికి మెట్లు ఉన్నాయి. మహారాజు లు ఇందులో స్నానాలు చేసేవారని పెద్దలు అంటారు.





## మహిమాన్విత అరసవిల్లి ఆలయం

శ్రీకాకుళం ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఒక నగరం. శ్రీకాకుళం జిల్లా కేంద్రం. ఇదే పేరుతో అసెంబ్లీ నియోజకవర్గం, పార్లమెంట్ నియోజకవర్గం ఉన్నాయి. ఈ పట్టణం నాగావళి నది ఒడ్డున నదికిరువైపుల విస్తరించి ఉంది ఈ నగరాన్ని బలరాముడు కనుగొన్నట్టు భావిస్తారు. ప్రసిద్ధమైన అరసవిల్లి సూర్యనారాయణస్వామి దేవాలయం శ్రీకాకుళం పట్టణానికి ఒక కి.మీ దూరంలో ఉంది. ఈ దేవస్థానం బహుళ ప్రసిద్ధి చెందినది. ఒకప్పుడు ఈ గ్రామాన్ని ''హర్షవల్లి'' అనేవారని క్రమక్రమంగా ''అరసవిల్లి'' అయిందని చెపుతారు. ఇక్కడి సూర్యదేవాలయంలో కల ఈస్వామిని స్వయంగా దేవేంద్రుడే ప్రతిష్ఠించాడని స్థలపురాణం ద్వారా తెలియుచున్నది. ఇక్కడ లభించిన శాసనాలు క్రీ.శ.7వ శతాబ్దానికి చెందినవి. ఇది ప్రాచీనదేవాలయంగా చెప్పవచ్చు. భారతదేశంలో ఉన్న కొద్ది సూర్యదేవాలయాలలో ఇది ఒకటి. ఈదేవాలయంలోని ఒక మహత్తరమైన విషయం ఉంది. సంవత్సరానికి రెండుపర్యాయాలు సూర్యకిరణాలు ఉదయసంధ్యలో మూలవిరాట్టు పాదాలకు సోకేలా ప్రసరిస్తాయి. ప్రతి సంవత్సరం మార్చి, అక్టోబర్‌లలో ఇది జరుగుతుంది.



# ఆంధ్ర నేతాజీ మద్దూరి అన్నపూర్ణయ్య

గాంధీయుగం నాటి స్వాతంత్ర్య యోధుల్లో మద్దూరి అన్నపూర్ణయ్య అగ్రగణ్యుడు. గాంధీగారి సబర్మతి ఆశ్రమం మాదిరిగా తూర్పుగోదావరి జిల్లా రాజమహేంద్రవరం సమీపంలో సీతానగరంలో గాంధీ ఆశ్రమం స్వాతంత్ర్య యోధులకు ఆరోజుల్లో ఆటపట్టుగా ఉండేది. బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం నెలకొల్పిన సీతానగరం ఆశ్రమంలో గాంధేయవాదిగా గడిపారు. గాంధీజీ నిర్మాణ కార్యక్రమాలను తుచ తప్పకుండా అమలు జేసిన తొలితరం గాంధేయవాదుల్లో ఆయన ముఖ్యులు.



*నేతాజీ సుభాష్ చంద్రబోస్‌తో మద్దూరి అన్నపూర్ణయ్య (ఎడమవైపు)*

సీతానగరం ఆశ్రమంలో ఉండటంవల్ల గాంధీజీ సిద్ధాంతాలూ, మన్యం వీరుడు అల్లూరి సీతారామరాజు సహాధ్యాయి కావడం వల్ల విప్లవ భావాలూ ఆయనలో కలగలిసి ఉండేవి. సీతారామ రాజు సహాధ్యాయి కావడం వల్ల ఆయన ఆచూకీ చెప్పమని ఆరోజుల్లో తెల్లదొరలు అన్నపూర్ణయ్య గారిని వేధించేవారు. సీతారామ రాజు మాదిరిగా అన్నపూర్ణయ్యగారు కూడా రాడికల్ భావాలు కలిగిఉన్నా,గాంధీ మార్గంలోనే ఉద్యమంలో పాల్గొనేవారు. ఆయన తన భావాలను పత్రికల ద్వారా ప్రజల్లో వ్యాపింపజేసేవారు. పత్రికల సెన్సారింగ్ ఆరోజుల్లో ఎక్కువగా ఉండేది. కాంగ్రెస్ వీక్లీ పేరిట ఒక పత్రికను నడిపారు. ఆ పత్రికలో జనాన్ని రెచ్చగొట్టేట్టు వ్యాసాలు ప్రచురించేవారు. ఆ వ్యాసాలు ఎక్కడి నుంచి వచ్చాయో,ఎవరు రాశారో చెప్పమని తెల్లదొరలు అన్నపూర్ణయ్య గారిని వేధించే వారు. అయితే, పత్రికాధిపతిగా ఆ బాధ్యత తానే తీసుకుంటాననీ, రచయితలపేర్లు చెప్పడం ధర్మం కాదని ఆయన వాదించేవారు. దాంతో ఆయనను పలుసార్లు అరెస్టు చేసి జైలుకి పంపారు. జైలులో ఆయన 14 సంవత్సరాలు పైన గడిపారు. మద్దూరి అన్నపూర్ణయ్య కార్యస్థానం రాజమహేంద్ర వరం,చుట్టు పక్కల ప్రాంతాలే అయినప్పటికీ,ఆరోజుల్లో కాంగ్రెస్ పార్టీలో ప్రత్యేకంగా ఏర్పడిన సోషలిస్టువర్గంతో సన్నిహిత సంబంధాలు కలిగి ఉండేవారు. ఆ క్రమంలోనే ఆయన నేతాజీ సుభాష్ చంద్రబోస్‌కి దగ్గరయ్యారు. వారిద్దరి మధ్య అనుబంధం విడదీయరానిది.

నేతాజీ ఆంధ్రప్రదేశ్ పర్యటనను జయప్రదం చేయడంలో ఆయన కీలక పాత్ర వహించారు. నీలాంటి వాడు ఊరికొక్కడుంటే చాలునని నేతాజీ ఆరోజుల్లో అన్నపూర్ణయ్యను వెన్ను తట్టి ప్రశంసించారట. నేతాజీ మార్గం వేరైనా ఆయన గాంధీగారికి అత్యంత ప్రియమైన శిష్యుడని ఓ వ్యాసంలో మద్దూరి వారు అభివర్ణించారు. అలాగే, సుభాష్ చంద్రబోస్ స్థాపించిన ఫార్వార్డ్ బ్లాక్ పార్టీ ఆంధ్రప్రదేశ్ శాఖకు సారథిగా వ్యవహరించి ఆంధ్ర నేతాజీగా పేరొందారు. ఆరోజుల్లో సీతానగరం ఆశ్రమానికి వచ్చే యోధులంతా మద్దూరి వారి పత్రికలో వ్యాసాలను చదివి ఎంతో ఉత్తేజితులయ్యేవారు. ఆయన ధైర్యానికి మెచ్చుకునే వారు. కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ నిర్మాణంలో ఆయన కీలక పాత్ర వహించారు. ఆంధ్రప్రదేశ్‌లో ఆ పార్టీ పితామహునిగా పేరొందారు. ఆ పార్టీలో ఉంటున్నప్పుడే ఆయన లోక్‌నాయక్ జయప్రకాశ్ నారాయణ్, ఎస్‌ఎం జోషి వంటి సోషలిస్టు నాయకులతో సంబంధాలు పెంచుకున్నారు. సమసమాజం నిర్మాణం ద్వారానే భారత్ అభివృద్ధిని సాధించగలదని ఆయన త్రికరణ శుద్ధిగా విశ్వసించారు. సోషలిజం ఎందుకు?అనే మకుటంతో జయప్రకాష్ నారాయణ్ ఆంగ్లంలో రాసిన పుస్తకాన్ని అన్నపూర్ణయ్యగారు అనువదించి ప్రచురించారు. ఆ రోజుల్లో ఆ పుస్తకం హాట్ కేక్‌లుగా అమ్ముడుపోయాయి. అన్నపూర్ణయ్యగారి ఆదేశాన్ని ఆరోజుల్లో యువకులంతా సుగ్రీవాజ్ఞగా పాటించేవారనీ, ముందు,వెనకలు ఆలోచించకుండా ఉద్యమంలోకి దిగిపోయేవారని ఆంధ్రప్రభ విలేఖరిగా దాదాపు మూడు దశాబ్దాల పాటు వ్యవహరించిన పెండ్యాల తరచు చెబుతూ ఉండేవారు. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత ఆయన ఏడుసంవత్సరాల పాటు సజీవంగా ఉన్నారు. తొలి ప్రధాని పండిట్ జవహర్‌లాల్‌నెహ్రూ పాలనపై ఆరోజుల్లో నిప్పులు కురిపించిన రామమనోహర్‌లోహియా,జయప్రకాష్‌నారాయణ్‌వంటి సోషలిస్టులతో కలిసి మద్దూరి పోరాటాలు సాగించారు. జయప్రకాష్ ఇచ్చిన పిలుపుపై ఆంధ్రప్రదేశ్‌లో ఉద్యమాలకు సారథ్యం వహించేవారు. కాంగ్రెస్ నాయకుల్లో సేవాగుణం అంతరించి స్వార్థమే పరమార్థంగా మారడం వల్ల ఆయన తన రాజకీయాలను పూర్తిగా సోషలిస్టు పార్టీకే అంకితం చేశారు. సామ్యవాదం,సమసమాజం మనుషుల కోసమే కాదు. ప్రాంతాల మధ్య కూడా ఉండాలని ఆయన తరచు అనేవారట. అన్నపూర్ణయ్యగారివి తీవ్రవాద భావాలే అయినా,గాంధీమార్గాన్ని ఆయన ఎన్నడూ వీడలేదు. గాంధీజీని ఆరోజుల్లో ప్రత్యక్షదైవంగా సంభావించిన స్వాతంత్ర్య యోధుల్లో ఆయన ఒకరు. చివరి రోజుల్లో ఆయన ఆధ్యాత్మిక చింతనలో గడిపారు. మెహర్‌బాబాని ఆంధ్రప్రదేశ్‌కి ఆహ్వానించి పలు జిల్లాల్లో ఆయన కార్యక్రమాలను నిర్వహించారు. మెహర్‌బాబా బోధనల ప్రచారానికి వెలుగు అనే పత్రికను నడిపారు. తూర్పుగోదావరి జిల్లా కొమరగిరిలో పుట్టిన అన్నపూర్ణయ్యగారి కుటుంబానికి ఆ ప్రాంతంలో జమిందారులతో సమానంగా భూములూ,మంచి పేరూ ఉండేవి. ఉద్యమంలో పాల్గొనడం,సంపాదన లేకపోవడంతో చివరికి రెండు ఎకరాలు మాత్రమే మిగిలింది. దానికి కూడా ఫలసాయం సక్రమంగా వచ్చేది కాదట. చివరి రోజుల్లో భార్య కన్నుమూయడంతో ఆయన త్యాగశీలతనూ, నిస్వార్థ జీవితాన్ని దగ్గరగా చూసిన ఒక హోటల్ యజమాని రోజూ భోజనం పంపేవారట. తనపై ఎవరైనా ఔదార్యాన్ని చూపడాన్ని ఆయన సహించేవారు కారనీ, ఆయన దుర్భర స్థితిని చూడలేక శిష్యులే హోటల్ నుంచి రోజూ భోజనం తెచ్చేవారనీ చెబుతారు. త్యాగానికి ప్రతిఫలాన్ని ఆశించడం తప్పన్నది ఆయన సిద్ధాంతం. దేశ సేవ తన కర్తవ్యంగా భావించిన త్యాగశీలి ఆయన.ఉన్నదంతా పోగొట్టుకున్న ఆ మహాయోధుడు స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత ఏడు సంవత్సరాలు బతికినా ప్రభుత్వం నుంచి ఎటువంటి ప్రతిఫలాన్నీ ఆయన ఆశించలేదు. అందుకోసం ప్రయత్నించలేదు. దేశం మాకేమి ఇచ్చిందని కాకుండా,దేశం కోసం మనమేం చేశామన్న స్ఫూర్తిని రగిలించిన పాతతరం స్వాతంత్ర్య యోధుల్లో మద్దూరి అగ్రగణ్యుడు. ఆకాలంలో ఆయన గుర్తుగా ఒక పార్కుకి పేరు పెట్టారు. ఇప్పుడు అది ఎక్కడ ఉందో వెతుక్కోవాలి.

- చల్లా అనంత పద్మనాభ స్వామి

● అజ్ఞానాన్ని తొలగించే సామర్థ్యం కేవలం సద్గురువులకే ఉంది

# సోమరితనమే శత్రువు!



డా॥విడియాల చక్రవర్తి
కౌన్సెలింగ్ సైకాలజిస్ట్
సెల్.నెం. 9440139025

**అభివృద్ధిని కోరే మనిషి**
**మూడు దుర్గుణాలను వదిలివేయాలి**
**అతినిద్ర, బద్ధకం, సోమరితనం!**

❋❋❋

మనిషిలో అన్నింటి కంటే బలహీనత, అతను తన అసలు శత్రువుని గుర్తించకపోవటమే. ఆ శత్రువు ఎవరో కాదు. సోమరితనమే. జీవితంలో కష్టపడని వారు ఎప్పుడూ పైకి రారు. అలాంటి వారిని సమాజం గుర్తించదు. వారిని దగ్గర బంధువులు, మిత్రులు సైతం చేరదీయరు. అలాంటి స్థితికి మనం వెళ్లకుండా జాగ్రత్తపడాలి. మనలో చాలామంది ఏ పనిచేయాలన్నా పథకాలు రూపొందించటంలోనే సమయం వృధా చేస్తారు. గడిచిపోయిన సమయం మళ్లీ తిరిగి రాదని గుర్తించాలి. సమయాన్ని సక్రమంగా వినియోగించుకోవటం, వృధాకాకుండా చేసుకోవటం వల్ల సోమరితనం చోటు చేసుకోదు. క్రమశిక్షణగా పనిచేసే యంత్రంలా మనల్ని మనం తీర్చిదిద్దుకోవాలి. నిశ్శబ్దంగా, ఏకాగ్రతగా చేసే పని త్వరగా సమర్థవంతంగా పూర్తవుతుంది.

ఒక విజయం సాధించిన తర్వాత మనలో ఓశక్తి ఉద్భవిస్తుంది. ఆ శక్తిని, ఉత్సాహాన్ని మనం సరైన పద్ధతిలో వినియోగిస్తే అలాంటి విజయాలు మరిన్ని సాధించటానికి దోహదపడుతుంది. మనలో జనించిన శక్తిని వృద్ధి చేయాలంటే మనం ఆ శక్తిని నిరంతరం వినియోగించాల్సి ఉంటుంది. అప్పుడే మనం గొప్పవారు కాగలుగుతారు. మనలోని శక్తిసామర్థ్యాల బుద్ధితో జత కలిపి ముందుకి సాగితే మన విజయాన్ని ఎవ్వరూ అడ్డుకోలేరు.



సోమరితనాన్ని వదలి సమయాన్ని పొదుపుగా, పొందికగా వాడే కళ తెలిసిన వ్యక్తులే ఈ ప్రపంచాన్ని శాసించగలరని తెలుసుకోండి. అందువల్ల సమయాన్ని సక్రమంగా సద్వినియోగపరచటం మన ఉత్తమ అలవాటుగా మారాలి. మనం ఏం చెయ్యాలనుకుంటున్నామో, మనమే నిర్ణయించుకోవాలి. ఆ అధికారం మరొకరికి ఇవ్వకూడదు. మనలో చాలా మంది నలుగురిలో ఉన్నప్పుడు తమను గొప్పగా ప్రదర్శించుకోవాలనే తపనతో లేనిపోని విషయాల్ని చెబుతూ ప్రగల్భాలు పలుకుతుంటారు. అలాంటి వారు తాము అల్లిన వలలో పడటం కద్దు. అబద్ధాలు, అతిశయోక్తులు మనిషిని అశక్తుడ్ని చేస్తాయి. సత్యం శాంతం మనిషిని శక్తివంతుడ్ని చేస్తాయి.

మన జీవనసుఖాన్ని, ఆనందం గా అనుభవించాలనుకుంటే మన మనసుని ప్రశాంతంగా ఉంచుకోవాలి. ధైర్యమున్న మనుషులే శాంతంగా ఉండగలరు. కొందరు వ్యక్తులు ఆఖరి క్షణం వరకూ నింపాదిగా పనులు చేసుకుంటూ బయటకు వెళ్లే సమయం లో నానా హైరానా పడిపోతూ హడావిడి చేస్తారు. బస్సు వెళ్లిపోతున్న సమయంలో బస్‌స్టాండ్‌లోకి అడుగుపెడుతుంటారు. మరికొందరు రైలు వెళ్లిపోయాక గాని రైల్వే స్టేషన్‌కి చేరుకోరు. వెళ్లవచ్చులే ఇంకా టైం ఉందన్న కాలయాపన వారిలోని సోమరితనం వల్లనే వస్తుంది.

ఈనాడు డబ్బు, హోదా, పేరు ప్రతిష్టల పరంగా ఉన్నత శిఖరాలకు ఎదిగినవారంతా తమ స్వహస్తాలతో తమను తాము తీర్చిదిద్దుకున్నవారే. ప్రపంచం ఎంతో ముందుకెళుతుంది. మనం సోమరులుగా వెనకబడిపోతే నష్టపోయేది మనమే. అందుకు మనం ఈ లక్షణం ఉండటం వల్ల నష్టపోయిన అంశాలను గుర్తుంచుకోవాలి. దానిని కాస్త విశ్లేషించుకొని కేవలం నాలో ఈ చిన్న అవలక్షణ సోమరితనం ఉండటం వల్ల నేను ఎంతలా నష్టపోతున్నాను. ఎంతమంది దృష్టిలో లోకువగా ఉన్నాననే విషయం గమనించుకోవాలి. దాన్ని అధిగమించాలంటే బలమైన నిర్ణయం తీసుకోవాలి. కొందరిలో ఆలస్యంగా నిద్రలేవటం, తద్వారా వాళ్లు చేయవలసిన పనులు వెనకపడటం నిత్యం జరుగుతుంది. త్వరగా నిద్రలేవటం, వల్ల కలిగే ప్రయోజనాలను ముందుగా ఊహించుకోవాలి. ఉదయం 5గం. తరువాత నేను మంచంపై ఉండకూడదనే ఒట్టుపెట్టుకోవాలి. కొద్దిరోజులు సాధన ద్వారా మనం ఆ సోమరితనాన్ని పారదోలి త్వరగా నిద్రలేవగలుగుతాము. మన రోజువారీ కార్యక్రమాల్ని,పనుల్ని త్వరితగతిన పూర్తి చేసుకోగలుగుతాము. దేవుడు మనకు ఈ జీవితాన్ని ఇవ్వటమే కాకుండా పంచేంద్రియాలు, కాళ్ళూ చేతులు, ఇచ్చాడు. వాటన్నిటికంటే ముఖ్యంగా ఆలోచించగల మేధస్సును సమకూర్చాడు. మన నోరు తినటానికే కాదు, మాట్లాడటానికి కూడా ఉంది. శరీరం మేను వాల్చడానికే కాదు. వంగి పనిచేయటానికి కూడా ఉంది. మేధస్సు ఆనందించటానికే కాదు ఆలోచించటానికీ ఉంది. సమయం అవకాశం లభించినప్పుడు దీన్ని సద్వినియోగం చేసుకుని జీవన లాభాన్ని పొందకపోతే అది మన తప్పే. మంచం మీద పడుకుని ఐశ్వర్యాన్ని ఆశించేవారి గోడు దేవుడెందుకు వింటాడు? పుట్టుకతోనే మనకు అన్ని అవయవాలు, అవకాశాలు ఆయన ఇచ్చాడు. వాటి ఆధారంగా ఐశ్వర్యం, ఆనందం పొందటం మన విధి. అది దేవుడి బాధ్యత కాదు. చేతులు కాలాక ఆకులు పట్టుకుని ఏం ప్రయోజనం? అంటారు పెద్దలు. మన జీవితంలోని ఒక్కొక్క క్షణం అమూల్యమైనది. గంటల్లో రోజుల్ని కొలిచేవారు బట్టి సోమరిపోతులు కాలహరణము తప్ప కాలాన్ని ఉపయోగించుకోవడం వారికి తెలియదు. చురుకైనవారు గంటల పనిని నిముషాల్లో ముగిస్తారు. సోమరిపోతులు రోజుల్లో జరిగే పనిని నెలల తరబడి సాగదీస్తారు. మనం గొప్పవారు కావాలనుకుంటే, సమాజంలో పేరు ప్రతిష్టల్ని గడించాలనుకుంటే ముందుగా మనలోని 'సోమరితనం' అనే జాడ్యాన్ని వదిలెయ్యాలి. అది మన అభివృద్ధికి అన్నిటికన్నా పెద్ద శత్రువు. అందువల్ల ఈ శత్రువు బారిన పడకుండా జాగ్రత్త పడాలి. ఒకవేళ మనల్ని అది ఆవహించి ఉన్నా దాన్ని మన నుండి తరిమేయటానికి ప్రయత్నించాలి. దానికి నిరంతర సాధన పట్టుదల ఉంటే తప్పక దాన్ని అధిగమించగలం. మన జీవితాన్ని ఉన్నతంగా తీర్చిదిద్దుకోగలం అనే నగ్నసత్యాన్ని గుర్తుంచుకోండి. ●

**జీవితంలోని కష్టసుఖములన్నీ మన గత జన్మలోని కర్మల ఫలితములే ●**

# సీరియల్సా మజాకా!

"కాస్త ఒళ్లు వేడిగా ఉందోయ్" అని మార్నింగ్ నిద్రలేవడంతోటే ప్రకటించాడు సదానందం. ఆ వార్త కిచెన్‌లో ఉన్న సుజాతకు చేరింది. అంతే వణికిపోయింది. చేతిలో ఉన్న గరిటె జారవిడిచింది. కంగారులో కింద ఉన్న గిన్నెలపై కాలు వేసింది. అవి 'డబ డబా...' అంటూ సౌండ్ చేశాయి. ఇవన్నీ బెడ్‌రూమ్‌లో ఉన్న సదానందం చెవికి చేరాయి. 'తనకు జ్వరంగా ఉంటే వైఫ్ ఆందోళన చెందకుండా!' నిరసన వ్యక్తం చేస్తోందని అర్థమైంది. "డార్లింగ్ జస్ట్ అంటే కొంచెం మాత్రమే వేడిగా ఉంది డోలో వేసుకుంటే తగ్గుతుంది" అని వినిపించేలా అరిచాడు. మరుక్షణం "టూమినిట్స్‌లో కాఫీ తెస్తాను" అనే చల్లటి వార్త వినిపించింది. "అమ్మయ్యా అంటే వైఫ్‌కు కోపం తగ్గిందన్నమాట" అని రిలాక్స్ అయ్యాడు.

కొద్ది క్షణాల తర్వాత కాఫీ కప్పుతో వచ్చింది వైఫ్ సుజాత. "సారీ అండీ మీకు ఒళ్ళు వేడిగా ఉందని తెలిసి తెగ కంగారు పడ్డాను" అంటూ ప్రేమగా కాఫీ కప్ చేతి కిచ్చింది.

"మరైతే కిచెన్ నుండి సౌండ్లు వినిపించాయేమిటీ?" డౌట్‌తో అడిగాడు.

"ఓహ్... అవా.. కంగారులో అలా జరిగిందన్నమాట. మీరు టాబ్లెట్ వేసుకుని ఆఫీసుకు వెళతాను అన్నారుగా కంగారు తగ్గింది."

"హజ్బెండ్‌కు జ్వరంగా ఉందంటే మీ లేడీస్ ఇంట్లో ఉండమంటారు కదా? దీనికి రివర్స్ గా నువ్వు ఆఫీసుకు వెళ్ళమంటున్నావ్?" అనుమానంతో అడిగాడు.

అంతే సుజాత ఫేస్ మల్టీకలర్స్‌లోకి మారింది. "జస్ట్ ఒక మోస్తరు టెంపరేచర్ ఉంటే సెలవు పెట్టేస్తారా?. ఇంట్లో తిష్టవేద్దామని ప్లాన్ చేశారు. రోజంతా మీకు సర్వ్ చేయలేక ఛావాలి. పైగా ఈ రోజు 'మొగుడే దేవుడు' సీరియల్ వస్తుంది మీకు సేవలు చేస్తూ కూర్చుంటే సీరియల్ మిస్ అవుతుంది" అని ఉక్రోషంగా చెప్పింది.

"హజ్బెండ్ కంటే సీరియల్ ముఖ్యమా!!" ఆశ్చర్యంగా అడిగాడు.

"హజ్బెండ్‌ను ఒకసారి కొనుక్కున్నాక సారీ ఒకసారి కమిటయ్యాక ఎక్కడికి పోతాడు. అదే సీరియల్ మిస్సయితే వాళ్ళని వీళ్ళని అడగాల్సి వస్తుంది."

"నిజంగా సీరియల్స్ అంత బావుంటాయా?" ఆసక్తిని ప్రదర్శించాడు.

"అవునండి డైలీ సీరియల్ 'అత్తా నీ పంబరేగుద్దిలో' అయితే కోడలు భలే తెలివైందండి. అన్నంలో డ్రగ్స్ కలిపి అత్తకు తినిపిస్తుంది. పాపం అది తినేసి అత్త గుర్రుపెట్టి నిద్రపోతుం టుంది. ఒకసారి పొరపాటున అత్త తినాల్సిన అన్నం తనే తినేస్తుంది. అప్పుడు భలే సరదాగా ఉంటుందండీ... ఇంకా 'శఠగోపం' సీరియల్లో అయితే హీరోయిన్ తన ప్రియుడిని చంపడానికి ఇంకా అంటే త్రీ ఇయర్స్‌గా ప్రయత్నిస్తూనే ఉంది. పాపం ఆమె టార్గెట్ ఎప్పటికి పూర్తవుతుందో " అంటూ కళ్ళు తుడుచుకుంది.

వైఫ్ సుజాత ఉత్సాహంగా చెబుతుంటే సదానందం నీరుగారిపోయాడు. "ఇలా సీరియల్స్ చూసి చూసి మొగుడిపై ప్రయోగించరు కదా?" అనుమానంగా అన్నాడు.

"అబ్బా అంత అదృష్టం కూడానా... సీరియల్స్ కాబట్టి ఒక మొగుడు పోతే ఇంకోడు దొరుకుతాడు. రియల్ లైఫ్‌లో అదిసాధ్యం కాదుగా..." అంటూ మూతి మూడు వంకర్లు తిప్పింది.

వైఫ్ తీరు చూస్తుంటే సదానందంకు టెంపరేచర్ మరింత పెరిగింది. ఆఫీసుకు వెళ్ళడం అనుమానమే అనిపించింది. ఇదే విషయం చెబితే వైఫ్ మరోసారి శివతాండవం చేస్తుందని డౌట్ వచ్చింది.

"డాళింగ్.. కాస్త రిలీఫ్‌గా ఉంది. ఆఫీసుకు వెళతాను" అన్నాడు నెమ్మదిగా.. వద్దంటుందని ఏ మూలనో ఆశగా



ఉన్నా...

భర్త నుదుట చేయిపెట్టి చూస్తూ ''ఫరవాలేదులేండి. మరో టాబ్లెట్ వేసుకుంటే పూర్తిగా తగ్గిపోతుంది. క్యాబ్ బుక్ చేయమంటారా?''

అంతే చివరి ఆశ కూడా పోయింది. ''సరే...'' అన్నాడు నీరసంగా...

'భర్తే యముడు' సీరియల్లో టూ హండ్రెడ్ డిగ్రీల జ్వరం ఉన్నా సరే హీరో ఆఫీసుకు వెళ్ళేవాడు తెలుసా?''

''పిచ్చి ముఖమా టూ హండ్రెడ్ ఉంటే ఆఫీసు కాదు డైరెక్ట్‌గా నరకానికే పోతాడు చెప్పడానికైనా రీజనింగ్ ఉండాలి'' అని అరిచాడు.

''అబ్బా మీ మగాళ్ళంతా ఇంతే రీజనింగ్ అంటూ లాజిక్‌గా మాట్లాడతారు. అతను హీరో కాబట్టి తట్టుకున్నాడు. మీరైతే జస్ట్ ఒళ్ళు వేడిగా ఉంటే కళ్ళు తేలేశారు'' అని విసురుగా అన్నది.

''ఒళ్లు వేడికాదే పిచ్చి ముఖమా. ఊరంతా డెంగ్యూ ఉంది. మా ఆఫీస్‌లో అందరికీ వచ్చి చచ్చింది. అదే నాకు తగులుకుంది'' అని విసుక్కున్నాడు.

''డెంగ్యూనా? జస్ట్ దోమ కుడితే జ్వరం వస్తుందా? మీదేం బాడీ అండీ. 'పక్కింటి శూర్పణక' సీరియల్లో అయితే హీరోని జెర్రిపోతులు కుట్టినా సరే దుక్కలా ఉన్నాడు.''

మళ్లీ సీరియల్‌లోని పాత్రల ప్రస్తావన తేవడంతో సదానందంకు ఈసారి గుండెలో కలుక్కుమంది. ఛాతిని చేత్తో పట్టుకుంటూ ''ప్రతిదానికి ఇలా సీరియల్స్ పోలిస్తే గుండెపోటు వచ్చేలా ఉందే'' అని అరిచాడు.

భర్త ఇబ్బందిని గమనిస్తూ ''భలేవారండీ మీవి రాతిగుండె అని, ఎలాంటి రోగాలు నొప్పులు లేని వంశమని మన పెళ్లి కుదిర్చిన మీడియేటర్ చెప్పాడు.''

''వాడు చెప్పి చచ్చింది నిజమే... కానీ నా గుండెపోటుకు నీ పిచ్చి ప్రేలాపన కారణం... ప్లీజ్ సీరియల్స్ గురించి మాట్లాడకు..'' అని రిక్వెస్ట్ చేశాడు.

''మీరు అలా అంటారు కానీ, సీరియల్స్ వల్ల చాలా ఉపయోగాలున్నాయండీ. మా ఆడాళ్ళమంతా సీరియల్స్ చూస్తూ కొత్త చీరల గురించి, నగల గురించి అత్తిం టి గురించి మర్చిపోతాం. దీనివల్ల మీ పర్స్ సేఫ్.''

వైఫ్ చెప్పిన విషయం టూ సెకండ్స్ ఆలోచించాక నిజమే అనిపించింది. ''అవును సుజాత ఈ విషయం మాత్రం నిజమే. అత్తింటిని మర్చిపోయే మీరు పుట్టింటిని మరవరేమీ?'' లా పాయింట్ లేవదీశాడు.

అంతే సుజాత ఫక్కున నవ్వేసింది. ''ఈ చిన్న విషయం కూడా మీకు తెలియదా... అందుకే తాటాకుల వాళ్ళకి ఆకులే కానీ కాయలు కనపడవంటారు...''

వైఫ్ తమ వంశంపై చమక్కులు విసరడంతో సదానందంకు కోపం వచ్చింది. ''అలా వితండవాదన చేయకుండా అడిగిన ప్రశ్నకు సూటిగా సమాధానం చెప్పు...''

''అత్తింటి వారిని మర్చిపోయి పుట్టింటి వారిని గుర్తుంచుకోవడానికి కారణం కూడా సీరియల్స్. ఎందుకంటే ప్రతి సీరియల్లో లేడీసే విలన్స్ కదా... అన్నీ పుట్టింటి నుండే జరుగుతుంటాయి. కాబట్టి ప్రతిక్షణం పుట్టిల్లు గుర్తుంటుంది'' అని చేంతాడంత వివరణ ఇచ్చింది.

అంతే ''హమ్మా నొప్పి...'' అంటూ గుండె చేత పట్టుకుని పడిపోయాడు సదానందం.

''అబ్బా ఇప్పుడే పడాలా... మరో టెన్ మినిట్స్‌లో 'మొగుడే దేవుడు' సీరియల్ మొదలవుతుందండీ'' అంటూ విసుక్కుంది.

''నా హార్ట్‌కంటే సీరియల్ ముఖ్యమా...'' అని డిటిఎస్‌లో అరిచాడు.

''ఈ తరం లేడీస్‌కి సీరియల్సే ముఖ్యమండీ... హార్ట్ ప్రాబ్లమ్ ఉంటే హాస్పిటల్లో చేరితే తీరుతుంది. అదే సీరియల్ మిస్సయితే మాత్రం చాలా నష్టం జరుగుతుంది.'' అని చెప్పి.

''లేడీస్ సీరియల్స్ చూడకుండా మీ మగాళ్ళు ఇలాంటి ట్రిక్స్ ప్లే చేస్తారని పక్కింటి వనజాక్షి చెప్పింది. కాబట్టి మీరు చేసిన యాక్టింగ్ చాలు. లేచి ఆఫీసుకు వెళ్ళండి'' అని ఆర్డినెన్స్ పాస్ చేసింది.

ఇక తప్పదన్నట్టు బరువుగా కదిలాడు సదానందం.

- కె. రామనారాయణరాజు

## బిజినెస్‌మేన్

ఒకసారి ఒక పెద్ద బిజినెస్ మేన్ కార్‌లో వెళ్తూ వెళ్తూ ఒక ఫ్యామిలీ రోడ్డు పక్కన గడ్డి తింటూ ఉండటం చూసి కార్ ఆపి వాళ్లని ఇలా అడుగుతాడు.



***బిజినెస్‌మేన్:*** మీరిలా గడ్డెందుకు తింటున్నారు?

***పేదయజమాని:*** మేము బాగా పేదోళ్లమండి. తినడానికి తిండి లేక ఈగడ్డి తింటు న్నాం. అంతలో బిజినెస్‌మేన్ కొంతసేపు దీర్ఘంగా ఆలోచించి వాళ్లింటికి రమ్మని కారెక్క మంటాడు.

***పేదయజమాని:*** అయ్యా మా తమ్ముడు వాళ్ల కుటుంబం కూడా ఉంది రమ్మంటారా?

***బిజినెస్‌మేన్:*** తీసుకురా, మీ కుటుంబం మొత్తాన్ని తీసుకురా.

వాళ్లందరినీ ఇంటికి తీసుకెళ్లాక తన పెరడులోకి తీసుకెళ్లి బాగా ఏపుగా పెరిగిన గడ్డి చూపిస్తూ ఇలా చెప్తాడు. ఈ గడ్డంతా మీరు ఉచితంగా తినచ్చు. ఎవర్నడిగినా బాగా కూలి అడుగుతున్నారు అని అన్నాడు.

అది విని ఆఁ...అంటూ నోరెళ్లబెట్టాడు పేద యజమాని.

## బాధ్యత

ఒక వ్యక్తి హాస్పటల్ బెడ్ మీద చావు బ్రతుకుల మధ్య తన భార్యని పిలిచి ఇలా చెబుతాడు.

'నువ్వు కూకట్‌పల్లిలో ఉన్న పది అపార్ట్‌మెంట్స్ తీసుకో'

పెద్ద కొడుకుని పిలిచి 'నువ్వు దిల్‌షుఖ్ నగర్‌లోని మూడు షాపింగ్ మాల్స్, ఒక గుడి తీసుకో'

రెండో కొడుకుతో 'నువ్వు మెహదీపట్నంలోని రెండు టెంపుల్స్ తీసుకో'

చిన్నోడిని పిలిచి 'ఒరేయ్ నువ్వు లకడీకాపూల్‌లోని రెండు కాలనీలు తీసుకో'

కూతుర్ని పిలిచి 'నువ్వు శ్రీనగర్‌లోని రెండు స్వీట్ షాప్స్ తీసుకో' అని చెప్పి చనిపోతాడు.



ఇంతలో ఇవన్నీ పక్కనే ఉండి వింటున్న నర్స్ అంటుంది 'మీ వారు చాలా గొప్పవారు కదా, పోతూ పోతూ బోలెడు ఆస్తి సంపాదించడమే కాకుండా బాధ్యతగా పంచిపెట్టి మరీ పోయారు'

'ఆస్తా పాడా మాది పాల వ్యాపారం. పాల ఖాతాలు అప్పచెప్పి పోయాడు సచ్చినోడు' అని వాపోయింది. ●

మానవ బలం కన్నా దైవ బలం మిన్న ●

● ప్రత్యేకం

# మన రూపాయే రారాజు



అమెరికా, లండన్, సింగపూర్, ఆస్ట్రేలియా, జర్మనీ, దుబాయ్‌లాంటి పాశ్చాత్య, అభివృద్ధి చెందిన దేశాల కరెన్సీలతో మన రూపాయిని పోలిస్తే చిన్నబోతుంది. ఆయా దేశాలలో విహరించాలన్నా, షాపింగ్ చేయాలన్నా ఎన్నో రూపాయలు కావాలి. ఆ సమయంలో మన విలువ తక్కువ రూపాయిని తలుచుకుని నిరాశపడతాం. అలా నిరాశపడే వేళ కొంచెం ఊరటకలిగించే దేశాలు కూడా ఉన్నాయి. అంటే మన కరెన్సీ కంటే ఆ దేశాల్లోని కరెన్సీ విలువ తక్కువ. అందులో ప్రముఖమైన దేశాలు కూడా ఉన్నాయి. ఈ విషయం వింటే ఆశ్చర్యం కలుగుతోంది కదా. సరదాగా టూర్‌కి వెళ్లాలనుకునేవారు తక్కువ బడ్జెట్ లో ఆయా దేశాలను సందర్శించవచ్చు.

మన రూపాయి విలువను పెంచిన దేశాలివే-

**అల్జీరియా :** ఇక్కడ కరెన్సీ పేరు దినార్. ఈ దేశంలో మన రూపాయి విలువ 1.63 అల్జీరియన్ దినార్‌లతో సమానం

**హంగేరీ :** ఇక్కడ కరెన్సీ పేరు ఫొరింట్. ఈ దేశంలో మన రూపాయి విలువ 4.12 ఫొరింట్లతో సమానం

**నేపాల్ :** ఇక్కడ కరెన్సీ పేరు రూపీ. ఈ దేశంలో మన రూపాయి విలువ 1.60 నేపాలీస్ రూపీతో సమానం.

**ఇరాన్ :** ఇక్కడ కరెన్సీ పేరు రియల్. ఈ దేశంలో మన రూపాయి విలువ 469 రియల్‌లతో సమానం.

**బెలారస్ :** ఇక్కడ కరెన్సీ పేరు రుబ్లి. ఈ దేశంలో మన రూపాయి విలువ 323 రుబ్లిలతో సమానం

**కొలంబియన్ :** ఇక్కడ కరెన్సీ పేరు పెసో. ఈ దేశంలో మన రూపాయి విలువ 42 పెసోలతో సమానం

**లావోస్‌ఐ :** ఇక్కడ కరెన్సీ పేరు కిప్. 121 కిప్‌లతో మన ఒక రూపాయి సమానం

**మడగాస్కర్ :** ఇక్కడ కరెన్సీ పేరు అరియారీ. మన రూపాయి విలువ 45 అరియారీలతో సమానం

**సైరియన్ :** ఇక్కడ కరెన్సీ పేరు పౌండ్. మన రూపాయి విలువ 3 పౌండ్లతో సమానం.

**వియత్నాం :** ఇక్కడ కరెన్సీ డాంగ్. ఈ దేశంలో మన రూపాయి 333.98 డాంగ్‌లతో సమానం

**పరాగ్వే :** ఇక్కడ కరెన్సీ పేరు గురాని. ఈ దేశంలో మన రూపాయి విలువ 83.31 గురానీలతో సమానం







**కంబోడియా :** ఇక్కడ కరెన్సీ పేరు రీల్. ఈ దేశంలో మన రూపాయి విలువ 61.29 రీల్‌లతో సమానం

**కోస్టారికా :** ఇక్కడ కరెన్సీ కొలన్. ఈ దేశంలో మన రూపాయి విలువ 8.24 కొలన్లతో సమానం

**ఉగాండా :** ఇక్కడ కరెన్సీ పేరు షిల్లింగ్. ఇక్కడ మన రూపాయి 50 షిల్లింగ్‌లతో సమానం.

**మంగోలియా :** ఇక్కడ కరెన్సీ తుగ్రిక్. ఈ దేశంలో మన రూపాయి 33.31 తుగ్రిక్‌లతో సమానం

**ఇండోనేషియా :** ఇక్కడ కరెన్సీ రూపియా. ఈ దేశంలో మన రూపాయి 197.02 రూపియాలతో సమానం

**శ్రీలంక :** ఇక్కడ కరెన్సీ శ్రీలంకన్ రూపీ. ఈ దేశంలో మన రూపాయి 2.18 రూపీలతో సమానం

**పాకిస్తాన్ :** ఇక్కడ కరెన్సీ పాకిస్తానీ రూపీ. ఈ దేశంలో మన రూపాయి విలువ 1.56 పాకిస్తానీ రూపీలతో సమానం

**చిలీ :** ఇక్కడ కరెన్సీ పేరు పీసో. ఈ దేశంలో మన రూపాయి విలువ 9.95 పీసోలతో సమానం.

**సౌత్ కొరియా :** ఇక్కడ కరెన్సీ పేరు వన్. ఈ దేశంలో మన రూపాయి విలువ 16.52 వన్‌లతో సమానం.

**ఉజ్బెకిస్తాన్ :** ఇక్కడ కరెన్సీ పేరు సోమ్. ఈ దేశంలో మన రూపాయి విలువ 44.76 సోమ్‌లతో సమానం.

**జింబాబ్వే :** ఇక్కడ కరెన్సీ పేరు డాలర్. ఈ దేశంలో మన రూపాయి విలువ 5.40 జింబాబ్వే డాలర్లతో సమానం.

**జపాన్ :** ఇక్కడ కరెన్సీ పేరు యెన్. ఈ దేశంలో మన రూపాయి విలువ 1.53 జపనీస్ యెన్‌లతో సమానం.

ఇంకా మారిషస్, బంగ్లాదేశ్, బర్మా, ఇరాక్, కజికిస్తాన్, లెబనాన్, కెన్యా, నైజీరియా, జమైకా, అంగోలా, బురుండీ, సోమాలియా, లైబీరియా, రువాండాలాంటి అనేక దేశాల కరెన్సీ కంటే మన రూపాయి విలువే అధికం. అందుకే చాలామంది భారతీయులు ఈ దేశాల్లో పర్యటించేందుకు ఉత్సాహపడతారు. •

"నాయనా మీరంతా నాతో పాటు దక్షిణ దేశానికొచ్చి, ఈ దక్షిణాదిని కలయ తిరిగి అనేక క్షేత్రాలను సందర్శించారు...అనేక తీర్థాల్లో స్నానమాచరించారు. అనేక నదులను సందర్శించారు. అనేక కొండా కోనల్ని లోయల్ని చూశారు. మీకు ఎక్కడ ఎక్కువ ప్రశాంతత లభించిందో చెప్పండి. మనం అక్కడే స్థిర నివాస మేర్పరచుకొని తపమాచరిద్దాం" అన్నాడు పరాశరేశ్వర మహర్షి తన శిష్యగణంతో.

"స్వామీ! మీరు సర్వజ్ఞులు మీకు మేము చెప్పేటంతటి వారంకాము. మేమంతా మీ దయవల్ల దక్షిణ దేశానికొచ్చి ఇక్కడున్న క్షేత్రాలను దర్శించాం...



# యోగీ మల్లవరంలో పరాశరేశ్వరాలయం

మీరు ఎక్కడ సెలవిస్తే మేము ఆ ప్రాంతంలోనే మీతో పాటు ఉంటూ తపమాచరించుకొని ఆ పరమశివునిలో ఐక్యమవుతాం"అన్నాడు పరాశరేశ్వర మహర్షి ప్రధాన శిష్యుడు పరమశివం.

"మనం దక్షిణ దేశంలో తిరిగిన అన్ని క్షేత్రాల్లోకి తిరుపతి క్షేత్రమే ప్రసిద్ధమైందనిపించింది. అన్నింటికి మించి తిరుపతి సమీపంలోని స్వర్ణముఖీ నదీ పరీవాహక ప్రదేశం నా మనస్సును ఉత్తేజపరిచింది. అక్కడ చాలా ప్రశాంతత చేకూరింది. మనం తపస్సు చేసుకోవడానికి తిరుపతిలోని స్వర్ణముఖీనదీ ప్రాంతమే అనువైంది. మనమంతా అక్కడికెళ్లి తపమాచరిద్దాం" అన్నాడు పరాశరేశ్వరుడు దక్షిణ దేశంలోని చిట్టచివరి క్షేత్రం రామేశ్వరంలో.

"స్వామీ! మా మనసులోని మాటే మీరు చెప్పారు...ఇందులో ఏమాత్రం అతిశయోక్తి లేదు...ఎందుకో తిరుపతిలోని స్వర్ణముఖీ నదీ మా మనసుల్ని ఉల్లాసపరిచి, తపమాచరింపచేయడానికి ప్రేరేపించింది. దీనిని గురించి మీ శిష్యులమైన మేము చాలాసార్లు చర్చించుకున్నాం కూడా...మా అందరి మనసులోని మాట మీరు చెప్పారు. తిరుపతిలోని స్వర్ణముఖీ తీర ప్రాంతంలో తపమాచరించడానికి మా అందరికీ ఇష్టమే" అన్నాడు మరో ముఖ్య శిష్యుడు నీలకంఠ. అందరూ రామేశ్వరం నుండి తిరిగి వచ్చి తిరుపతి సమీపంలోని స్వర్ణముఖీ తీరంలో తపమాచరించుకోవడం మొదలెట్టారు.

"స్వామీ! మేము చేసే తపస్సుకు ఏకాగ్రత ఉండాలి...మా మనసుల్ని కేంద్రీకరించుకోవడానికి ఒక దైవముండాలి....దానిని మీరు ప్రతిష్టిస్తే మా తపస్సుకు ఒక లక్ష్యం ఏర్పడుతుంది. మా దృష్టినంతా దానిపైనే కేంద్రీకరించడానికి వీలౌతుంది"అన్నాడు ప్రధాన శిష్యుడు పరమశివం.

"నిజమే! నేనొక శివలింగాన్ని స్వర్ణముఖీ నదీ తీరానికి ఉత్తరం వైపు తిరుపతిని ఆనుకొని ప్రతిష్టిస్తాను. ఆయనే పరాశరేశ్వరుడిగా మీ మనసుల్లో ఉంటాడు. ఆయన్నే మీరు ధ్యానించండి తపమాచరించండి కైవల్యం ప్రాప్తిస్తుంది" అన్నాడు పరాశరేశ్వరుడు.

"స్వామీ మీరు అద్భుతమైన దివ్య ముహూర్తంలో పరాశరేశ్వరుణ్ణి ప్రతిష్ఠించారు. మా మనసంతా ఆయనే నిండిపోయారు. అనునిత్యం మేము నిద్రలేచింది మొదలు విశ్రమించేదాక ఆ పరాశరేశ్వరుణ్ణి అర్చిస్తూ, ధ్యానిస్తూ, తపమాచరిస్తూ ప్రశాంతంగా జీవిస్తున్నాం...మాకు ఇంతకన్నా ఇంకేం కావాలి...మీ శిష్యులమైన మేము,నదికి ఇరువైపులా చేరి తపమాచరిస్తున్నాం...పరాశరేశ్వరుని అభిషేకిస్తూ, అర్చిస్తూ సేవిస్తున్నాం...మా జన్మ చరితార్థమైంది" అన్నాడు పరమశివం.

ఇలా పరాశరేశ్వరుణ్ణి అర్చిస్తూ ఈ ప్రాంతంలో తపమాచరిస్తూ మునులు కైవల్యం పొందారు. తర్వాత కొంత కాలానికి పరాశరేశ్వరుని మనవడు శుకమహర్షి తన శిష్య పరివారంతో తన తాతని వెదుక్కొంటూ ఈ ప్రాంతానికొచ్చాడు.

"స్వామీ! ఇక్కడే మీ తాత ఆయన శిష్యులు తపమాచరించి కైవల్యాన్ని పొందారు. ఇదిగో మీ తాత ప్రతిష్ఠించిన పరాశరేశ్వరస్వామి నిత్య పూజలందుకొంటూ దేదీప్యమానంగా వెలిగిపోతున్నాడు. ఈ ప్రాంత ప్రజలతో విడదీయరాని అనుబంధాన్ని కలిగి ఉన్నాడు" అన్నాడు శుకమహర్షి శిష్యుడు.

"ఆహా! నాకెందుకో ఈ ప్రాంతంలోకి అడుగుపెట్టానే, ఏదో తెలియని, అనిర్వచనీయమైన భావన కలుగుతోంది...నేను మా తాతగారైన పరాశరేశ్వరుని వెదకి తీసుకొని వెళ్లాలని వచ్చాను. తీరా ఇక్కడికి వచ్చాక, నాకు కూడా ఇక్కడి నుండి తిరిగి వెళ్లడానికి మనస్సు అంగీకరించడం లేదు. నేను మా తాత బాటలోనే నడుస్తాను. నేను కూడా ఇక్కడే తపమాచరిస్తూ నా జన్మను సార్థకం చేసుకొంటాను"అన్నాడు శుకమహర్షి.

"స్వామీ! మీ శిష్యరికంలో మేము పునీతులౌతున్నాం...మీరు ఎక్కడుంటే మేము అక్కడే...మీతో పాటే మేము ఇక్కడే తపమాచరిస్తూ జీవిస్తాం....దయచేసి మీరు మాకు అడ్డుచెప్పకండి. వేలాదిగా ఉన్న మేము ఈ స్వర్ణముఖి నదికి అటుఇటువైపులా తపమాచరించుకొంటూ ఇక్కడి పరాశరేశ్వరుని పూజల్లో పాల్గొంటుంటాము. అలాగే మిమ్మల్ని రోజూ సేవించుకొంటాం" అన్నాడు శుకమహర్షి మరో శిష్యుడు.

"అంతా దైవేచ్ఛ...ఏది ఎలా జరగాలో అలాగే జరుగుతుంది. అందరం కలిసి వచ్చాం...కలిసే ఇక్కడుంటాం"అన్నాడు శుకమహర్షి.

"శుకమహర్షి స్వర్ణముఖినదీ ఉత్తరం ఒడ్డున తపస్సు చేస్తుండగా ప్రజలు మెల్లమెల్లగా ఇక్కడ నివాసాలేర్పరచుకొన్నారు. ఈ స్థావరాన్నే 'శ్రీ శుకనూరు' అన్నారు. ఇది తమిళంలో 'తిరుచ్చుగనూరు' అని అదే తర్వాత 'తిరుచానూరు' అయిందని అంటారు. ఈ శుకమహర్షి వెంట ఉండిన మునులు నివసించిన ప్రదేశాన్ని 'మునులపూడి' అన్నారు. అదే కాలక్రమంలో ముండ్లపూడి గ్రామం అయింది. శుకమహర్షి దగ్గర యోగవిద్యల్ని, మల్ల యుద్ధ విద్యల్ని, నేర్చుకొన్న విద్యార్థులుండే ఊరిని 'యోగి మల్లవరం' అని అన్నారు. అలాగే ఈ మునీశ్వరులకు, విద్యార్థులకు, జనులకు పాలు, పెరుగు అందించే రైతులుండే ఊరిని 'పాడి పేట' అని అంటారని చెప్పాను నేను.

"ఈ ఊరికి ఎనిమిదో శతాబ్దంలో తిరుచ్చొగినూరు అని, పదవ శతా

● స్వార్థ చింతనయే వ్యక్తి పతనానికి నాంది

బ్దంలో తిరుచ్చుగ నూరు అని, అలాగే 10వ శతాబ్దం నుండి 15వ శతాబ్దం వరకుండే శాసనాల్లో తిరుచ్చుకనూరు అని కనిపిస్తుంది. ఆ తర్వాత ఈ తిరుశుక నూరే తిరుచానూరు అయి చిత్తానూరుగా వ్యవహారంలోకి వచ్చింది. ఈ తిరుచానూరే అలమేలు మంగాపురంగా కూడా తర్వాత తర్వాత వెలుగులోకి వచ్చింది" అన్నాడు మాతో పాటు ఉన్న చారిత్రక పరిశోధకుడు వేడియం భాస్కర్.

''ఒకప్పుడు తిరుమల వేంకటేశ్వరస్వామిని శివునిగా భావించే రోజుల్లో ఈ యోగి మల్లవరం ఒక వెలుగు వెలిగింది. తిరుమల ఆలయ పాలనంతా ఈ యోగి మల్లవరంలోని శైవసభలే నిర్వహించేవి. అందుకు కారణం ఆనాటి రాజులు శైవమతాభిమానులుగా ఉండడమే. ఆ తర్వాత క్రీ.శ. 1000లో రామానుజాచార్యులు వాదంలో శైవులను ఓడించి తిరుమలను వైష్ణవ క్షేత్రంగా తీర్చిదిద్దే వరకు తిరుమలలో శైవుల ఆధిపత్యం ఉండేది. ఇప్పటికీ తిరుమలేశుని ఆరాధనలోను, అలంకరణలోను శైవమత ప్రాధాన్యాన్ని మనం గమనించవచ్చు. ఉదాహరణకు బిల్వపత్ర అర్చన, నాగాభరణాలు, తిరుమలలో రామానుజాచార్యులు ఆలయ పూజాధికాలు, మార్పులు, చేర్పులు చేయడానికి కారణం మరొకటుంది. తిరుచానూరులో పూర్వం సభైయర్లు అనే ఒకసభ ఉండేది. ఈసభలోని వాళ్లే తిరుమల, తిరుపతుల్లోని ఆలయ పాలనను నిర్వహించేవారు. వీరు వైష్ణవులు. వీళ్లు దానాలు, మాన్యాలు స్వీకరించి పూజాధికాల్ని నిర్వహించేవారు. ఈ సభ క్రీ.శ.1008 వరకు వైష్ణవుల ఆధిపత్యంలో ఉండేది. చోళుల కాలంలో రాజాదరణ శైవమతానికి లభించింది. వైష్ణవ సభవారు పూజాదికాలు సక్రమంగా నిర్వహించడం లేదనే ఫిర్యాదులు రాజుగారికి అందాయి. దీంతో ఆనాటి చోళరాజు తిరుపతి చుట్టుపక్కల ఆలయాల పాలనను శైవసభ వారికిచ్చాడు. ఆనాడు కొండ మీదుండే తిరుమలేశునికి పెద్దగా ఆదాయం లేకపోవడం, తిరుమల వెళ్లి రావడం కష్టంగా ఉండడంతో శైవులు తిరుమలను ఉపేక్షించారు. ఇది వైష్ణవులకు సందు దొరికినట్లయింది. పైగా చోళరాజు ఉత్తర్వులను ధిక్కరించలేదు. మత సంఘటనల్ని నివారించడం కోసం వైష్ణవులు తిన్నతిన్నగా తమ కార్యకలాపాలను తిరుమలకు మార్చుకొన్నారు" అని తెలిపాను.

''ఒకప్పుడు ఈ యోగీ మల్లవరంలో భాగంగా ఉండే తిరుచానూరు నేడు పద్మావతీ అమ్మవారు కొలువైన ఆలయంగా రూపుదిద్దుకొంది. ఈ యోగీ మల్లవరం మాత్రం తిరుశుకనూరు అనే తిరుచానూరు నుంచి వేరుపడింది. ఇదో శివాలయం ఉండే ఊరుగా గుర్తింపు పొందింది. నిజానికి తిరుపతిని ఆనుకొని ఉండేదే యోగీ మల్లవరం. దాని పక్కనుండేదే నేటి తిరుచానూరు" అన్నాడు మా స్నేహితుడు బి.ఎస్.ఎన్.ఎల్‌లో పనిచేసే దర్శి ఉమామహేశ్వరరావు.

''తిరుచానూరు అనే పేరు తిరుశుకనూరు నుండి వచ్చిందన్నారు. అయితే శాసనాలను పరిశీలిస్తే 'తిరుచ్చొగినూరు' అనే పేరు మొదట కనిపిస్తుంది. తర్వాత తిరుచ్చొగునూరు, తిరుచ్చుగునూరు, తిరుచ్చుగనూరు అనే పేర్లు ఈ ఊరికి ఉన్నట్లు తెలుస్తోంది. అయితే పేరులోని చివరి రూపం 'శ్రీ శుకనూరు' అనే దానికి దగ్గరగా ఉంది కాబట్టి 'శ్రీ శుకనూరు' అన్నదే తిరుచానూరు అయ్యిందని సంస్కృత పండితులు అన్నారు. అయితే శాసన రూపాన్ని బాగా పరిశీలిస్తే, వాటి క్రమపరిణామాన్ని చూస్తే 'శ్రీ యోగినూరు' అనే పేరే మూల రూపం అని చెప్పడానికి వీలుంది. తిరు-చొగిన్-ఊరు అని మొదటి శాసన రూపాన్ని విడదీసుకుంటే తిరు అంటే శ్రీ అని, చొగిన్ అంటే యోగిన్ అని చెప్పొచ్చు. యోగిమల్లవరంలో యోగి శబ్దం ఉంది కాబట్టి యోగి, యోగిని అనేవి జైనసంప్రదాయాలు. అందుకే ఈ ఊరిని స్థానికులు జోగులు మల్లారం అని కూడా అంటారు. యోగులు-జోగులు ఒకటే అర్థం. దీనిని బట్టీ ఈ ఊరు జైనులకు సంబంధించిన క్షేత్రంగా చెప్పొచ్చు. జైనమతాన్ని దెబ్బతీసి శైవమతం వెలుగులోకి వచ్చిన సంగతి అందరికీ తెలిసిందే. జైన ఆలయాలన్నీ శివాలయాలుగా ఒకప్పుడు రూపుదిద్దుకున్నవే. 'పల్లె' అనే గ్రామానుబంధం జైన 'పల్లికూటం' నుంచి వచ్చిందే. నేడు పల్లె అంటే సాధారణంగా 'గ్రామం' అనే అర్థమే ఉంది. అలా ఆనాడు బహుళ వ్యాప్తిలో ఉన్న జైనమతం ఈ ప్రాంతంలో కూడా బాగా పాతుకొనిపోయి ఉండేది. నేడు తిరుచానూరులో ఉండే పద్మావతి, ఒక యోగిని అయి ఉండొచ్చు. కాబట్టి 'యోగినూరు' అయ్యింది. గుడి ఉండే ఊరు కాబట్టి 'శ్రీ'కి తమిళ రూపం 'తిరు' వచ్చి చేరింది. అలా తిరుయోగినూరు అయింది. ప్రముఖ శాసన చరిత్ర పరిశోధకుడు డి.బి.దేశాయ్ కూడా 'పద్మావతి' అనే జైన దేవతను కనీసం పేరును కూడా మార్చకుండా జైనమతం నుంచి మార్చేశారన్నాడు. దీనిని బట్టి చూస్తే ఒకప్పుడు తిరుచానూరు గొప్ప జైన క్షేత్రంగా ఉండేదేమోననిపిస్తోంది. ఒక తిరుచానూరుకు తిరుమలకు సంబంధం ఉంటే తిరుమల కూడా ఒకప్పుడు జైనక్షేత్రమే అవుతుంది. నేటికీ మన ఆచారాల్లో అనేక జైన ఆచారాలు కనిపిస్తుంటాయి. రాయలసీమలో ఇంకా ఎన్నో జైన స్థావరాలున్నాయి. సీతమ్మ స్నానాల గుంటలు, పాండవుల గుళ్ళు అన్నీ జైన శిథిలాలే. ఒకప్పుడు జైనమతానికి ప్రధాన ప్రదేశమైన మైసూరు రాష్ట్రం ఈ జిల్లాను ఆనుకొనే ఉంది. దీనివల్ల తిరుమల తిరుపతి ఆలయాలు ఒకప్పుడు జైన దేవాలయాలేమో అని సందేహం కలుగుతోంది" అన్నాడు వేడియం భాస్కర్.

''జైన దేవతల్లో పద్మావతి ప్రముఖ దేవతే. ఇప్పటికీ జైన ఆలయాలలో పద్మావతిని ఆరాధిస్తున్నారు. నేను ఆచార్య నాగార్జున యూనివర్శిటీకి వెళ్లినప్పుడల్లా గెస్ట్‌హౌస్‌కు ముందున్న జాతీయ రహదారిని ఆనుకొని ఉండే జైనదేవాలయానికి వెళ్తుంటాను. అక్కడ గర్భాలయం ప్రవేశంలో ముందున్న పద్మావతిని పూజిస్తారు. ఆ విగ్రహం అచ్చుగుద్దినట్లు మన హిందూ మతంలోని పద్మావతి విగ్రహం లాగానే ఉంటుంది. అయినా ఈ వాదవివాదాల జోలికి మనం వెళ్లకపోవడమే మంచిది. నిజాలు, చరిత్రను తెలుసుకోవడంలో తప్పులేదు. యోగీ మల్లవరానికి ఆ పేరు రావడానికి ఇది కూడా ఒక కారణమని అంటారు" అని చెప్పాను.

''యోగీ మల్లవరాన్ని తిరుపతి స్థానికులు జోగుల మల్లారం అని, యోగుల మల్లారం అనీ ఇప్పటికీ అంటుంటారు. ఈ ఊరిలోకి మనం అడుగుపెట్టినప్పటి నుంచి ప్రతి ఇంట్లో నేత మగ్గాల చప్పుడు ఎంతో లయాత్మకంగా వీనులవిందు చేశాయి. పైగా ఈ ఊరిలోని తొంభై శాతం ఇళ్లు మగ్గాల పైనే ఆధారపడి జీవిస్తున్నట్లనిపించింది. ఈ ఊరి ప్రత్యేకత చేనేత వస్త్రాలేనా?" అడిగాడు సీనియర్ జర్నలిస్టు కలువకుంట ఉమాశంకర్.

''మీరన్నది నిజమే!ఈ ఊరి చేనేత బట్టలు చాలా ప్రాంతాల్లో చాలా ప్రసిద్ధమైనవి. అంతేకాదు ఈ ఊరిలో ఆముదం తయారుచేస్తారు. తిరుపతి చుట్టుపక్కల ప్రాంతాల్లో 'జోగులమల్లారం ఆముదం' ఎంతో ప్రసిద్ధం. నెత్తిన పూసుకోవడానికే కాదు, వైద్యపరంగా తాగడానికి కూడా స్వచ్ఛమైన ఆముదాన్ని ఇక్కడే తయారుచేసేవారని మా చిన్నప్పుడు అంటుండేవారు" అని వివరించాను.

''ఈ యోగీ మల్లవరంలోని పరాశరేశ్వరాలయం చిత్తూరు జిల్లాలోనే తొలి చోళ ఆలయం. గతంలో ఈ ఆలయం ఎన్నో ఆటుపోట్లకు గురైంది. అయితే ప్రధానాలయం మాత్రం నేటికీ చెక్కుచెదరలేదు. ఈ ఆలయంలో 15శాసనాలు మాత్రమే మిగిలాయి. లభిస్తున్న వీటిలో తొలి శాసనం





ఆధ్యాత్మిక రంగంలో ఆత్మజ్ఞాన సిద్ధికి మనో చాంచల్యం అడ్డుగోడ లాంటిది●

# ● తిరుపతి కొండ కథలు

క్రీ.శ.1008లో చోళప్రభువు మొదటి రాజరాజు వేయించింది. ఇక క్రీ.శ. 1547లో విజయనగర చక్రవర్తి సదాశివరాయలు వేయించింది. చిట్టచివరి శాసనం. ఈ శాసనం తిరుమల ఆలయ ధర్మకర్తలనుపరాశరేశ్వరస్వామి నిత్యపూజకు పుష్పాలను పంపే ఏర్పాట్లు చేసింది. పరాశరేశ్వరస్వామి ఆలయ నిర్మాణం ఒక క్రమపద్ధతిలో లేదు. ఆలయానికి చుట్టూ ఎత్తైన ప్రహరీగోడ ఉంది. ప్రహరీలో తూర్పువైపు ద్వారం, పైమంటపం ఉన్నాయి. ఈ ఆలయాన్ని దీర్ఘచతురస్రాకారంలో నిర్మించారు. ప్రహరీ లోపల విశాలమైన ఆవరణలో ఆలయం ఉంది. దీనిలో గర్భాలయం, అంతరాళం, ముఖమంటపం, అలాగే ముఖమంటపం నుంచి అంతరాళం, గర్భాలయాలను చుట్టి ప్రదక్షిణాపథం ఉన్నాయి. దీనిలో ఉత్తరాన మూడు, దక్షిణాన మూడు, పశ్చిమాన రెండు చోళ శైలిలో ఉన్న స్తంభాలున్నాయి. అంతరాళం, గర్భాలయం, ముఖమంటపం కంటే కొంచెం ఎత్తులో ఉన్నాయి. గర్భాలయంలో ఈశ్వరుడు లింగరూపంలో కొలువై 'తిప్పలాధీశ్వర ముడైయ మహాదేవర్'గా పరాశరేశ్వర్ స్వామిగా పూజలందుకొంటున్నాడు" అన్నాడు వేడియం భాస్కర్.

"ఈపరాశరేశ్వరస్వామి ఆలయం లోపలి రాతిగోడలు అనేకశిల్పాలతో అలరారుతున్నాయి. గర్భాలయం వెలుపలి గోడల్లో ఉత్తరం, పడమర, దక్షిణం వైపు దేవకోష్టాలున్నాయి. ఉత్తరం వైపుండే కోష్ఠంలో చతుర్ముఖ బ్రహ్మ శిలా



విగ్రహముంది. ఈ శిల్పానికి ముందు చిన్న గుడిలో ఆసీనుడైన చండీశ్వరుణ్ణి ప్రతిష్టించారు. పడమరవైపుండే కోష్ఠంలో మహావిష్ణు విగ్రహముంది. దక్షిణం వైపుండే కోష్ఠంలో చతుర్భుజాలను కలిగిన దక్షిణామూర్తి ఆసీన విగ్రహముంది. ప్రదక్షిణ పడమరవైపు శివలింగం ప్రతిష్టింపబడి ఉంది. దాని పక్కనే సప్తమాతృకల పొడవాటి వెడల్పు విగ్రహాన్ని ప్రతిష్టించి ఉన్నారు. తిరుపతి పరిసర ప్రాంతాల్లో సప్తమాతృకలు ఇటుకల రూపంలో ప్రతిష్ఠింపబడి అక్కగార్లగా పిలవబడుతున్నారు. అలాంటిది ఇక్కడ వినుకొండ వల్లభరాయుడు క్రీడాభిరామం గ్రంథంలో చెప్పిన విధంగా అక్కలను పూజించే ఆచారం ఉన్నట్లుంది. ఒకప్పుడు అక్కల ఆరాధనోత్సవంలో ఏడుగురు స్త్రీలను అక్కలుగా అలంకరించి పీటలపై కూర్చోపెట్టి పూజించేవారు. సంతానం కోసం మొక్కుకొని యక్షకన్యలను ఆవాహనం చేయించి ఆరాధించేవారు. అందుకు ప్రతీకగా ఇక్కడ సప్తమాతృకల విగ్రహం ప్రతిష్ఠింపబడి ఉంది. అదే కాకుండా పక్కనే వల్లీ, దేవసేన సమేతుడైన సుబ్రహ్మణ్య స్వామి విగ్రహాలు ప్రతిష్ఠింపబడి ఉన్నాయి. ఇక అంతరాళం ముందు శుకమహర్షి విగ్రహం ప్రతిష్ఠింపబడి ఉంది. ఈ శుకమహర్షి పొడవాటి గడ్డాన్ని కలిగి, కుడిచేతిని మంత్రదండంపైన పెట్టుకొని, వేళ్ల మధ్యలో అక్షమాల, మెళ్లో రుద్రాక్షలు, తలపై జటా మకుటాన్ని కలిగి ఉన్నాడు" అని తెలిపాను.

"ఈ ఆలయంలో ప్రధానమైన నిర్మాణం ముఖ మంటపం. ఇది నాలుగు వరసల్లో వరుసకు నాలుగు స్తంభాల లెక్కన పదహారు స్తంభాలతో నిర్మించారు. ఇవన్నీ చోళ వాస్తురీతిలో మలిచారు. ఈ మంటపంలో ఈశాన్యం వైపు నవగ్రహాలను ప్రతిష్టించారు. ఈముఖమంటపంలోనే నాలుగు స్తంభాలతో నంది మంటపాన్ని నిర్మించి అందులో నందిని ప్రతిష్టించారు. ఈ నంది గర్భాలయంలోని స్వామిని ఎల్లప్పుడు చూస్తుండే విధంగా రూపొందించారు. ముఖమంటపాన్ని ఆనుకొని ఉత్తరం వైపు కామాక్షీదేవి మందిరాన్ని నిర్మించారు" అన్నాడు కలవకుంట ఉమాశంకర్.

"ఒకప్పుడు ఈ గుడికి ముందువైపు శిథిలమైన కల్యాణమంటపం ఉండేది కదా? అది ఇప్పుడేమైంది?" అడిగాడు దర్శి ఉమామహేశ్వరరావు.

"నిజమే! ముప్పయి సంవత్సరాలకు ముందు చోళుల చేత నిర్మించబడిన రాతి స్తంభాలతో కూడిన అందమైన కల్యాణ మంటపం ఉండేది. ఇది శిథిలమై కూలిపోయింది. ఇందులో అద్భుతమైన శిల్పాలుండేవి. నేను ఇంటర్మీడియట్ చదివే రోజుల్లో నా క్లిక్-3 కెమెరాతో ఈ ఆలయంతో పాటు శిథిలమైన కల్యాణ మంటపాన్ని సైతం ఫొటోలు తీశాను.ఈ కల్యాణ మంటప రాతిగోడపై నాట్యగణపతి శిల్పాన్ని ఫొటోతీసి తిరుమల తిరుపతి దేవస్థానం పత్రిక అయిన సప్తగిరికి పంపాను. అందులో నాట్యగణపతి ఫొటో ప్రచురితమైంది. ఆలయ విస్తరణలో భాగంలో శిథిల కల్యాణ మంటపాన్ని తొలగించేశారు. ఇలా ఇక్కడ ఎంతో అమూల్యమైన శిల్పసంపద కనుమరుగై పోయింది"అని చెప్పాను.

"తిరుపతిలో ఉండే ఇంత ప్రసిద్ధమైన ప్రాచీన దేవాలయాన్ని తిరుమల తిరుపతి దేవస్థానం వారు ఎందుకు తమ ఆధీనంలోకి తీసుకోలేదు?" ప్రశ్నించాడు కలువకుంట ఉమాశంకర్.

"నిజమే! ఇది ఖచ్చితంగా దేవస్థానం పరిధిలోకి రావాల్సిన ఆలయమే. సుదూర ప్రాంతాల్లో ఉండే ఆలయాలే దేవస్థానం పరిధిలో ఉన్నప్పుడు తిరుపతిలో ఉండే ఇంత ప్రాచీనమైన ఆలయాన్ని దేవస్థానం వారు స్వీకరించకపోవడం బాధాకరమే. ఒకప్పుడు ఈ ఆలయం నుండే శైవసభ తిరుమల ఆలయాన్ని నిర్వహించింది. ఇప్పుడు తిరుమల తిరుపతి దేవస్థానమే ఈ ఆలయ నిర్వహణను చేపట్టితే సమంజసంగా ఉంటుంది. అంటే నాడు ఈ ఆలయం నిర్వహణలో తిరుమల ఆలయముంటే నేడు తిరుమల ఆలయ నిర్వహణలో ఈ ఆలయముండాల్సిన అవసరమొచ్చింది...ఇదే దైవమాయంటే...త్వరలోఈ ఆలయ బాధ్యతల్ని తిరుమల తిరుపతి దేవస్థానం చేపడ్తుందని ఆశిద్దాం" అని అన్నాను.

"యోగుల మల్లారంలో ఇప్పుడెవరైనా యోగులు తపస్సు చేసుకొంటున్నారా? అలాగే స్వర్ణముఖి నదికి అవతలి ఒడ్డునున్న మునులపూడిలో మునులెవరైనా ఉన్నారా?" అడిగాడు దర్శి ఉమామహేశ్వరరావు.

"వందేళ్లకు ముందు ఇక్కడుండే గుడికి దక్షిణం వైపున్న ఇసుకతిన్నెల్లో యోగులు తపమాచరిస్తూ ఉండేవారని అంటారు. ఊరు విస్తరించి జనాభా పెరిగేసరికి యోగులు తిరుమల కొండ మీదున్న అడవులకు తరలి వెళ్లారంటారు. తిరుమల కొండ మీదున్న తీర్థాలు, జలపాతాల చెంత నుండే అడవుల్లో, గుహల్లో యోగులు నేటికీ తపమాచరిస్తున్నారు. యోగులు తిరుమలగిరుల్లో తపస్సు చేసుకొంటూ పరమయోగులైనారు...ధ్యానిస్తూ జ్ఞానులైనారు...భక్తితో ముక్తిని పొందుతున్నారు...సనాతన మతానికి ప్రతీకలుగా నిలుస్తున్నారు. మనకు మార్గదర్శకులైనారు"అని నేను చెప్పగా, యోగుల మీద భక్తివిశ్వాసాలతో 'పరమయోగులకు పరిపరి విధముల వరమొసగెడి నీ పాదము' అన్న అన్నమయ్య సంకీర్తనలోని చరణాలు వెంటనే మదిలో మెదిలాయి.

- డా॥ పేట శ్రీనివాసులు రెడ్డి
సెల్ నెం. 9849307333

● భౌతిక సుఖాలలో మునిగిపోవుట, మనోనిగ్రహము కోల్పోవుట వల్లనే జరుగుతుంది

# రెండు ధృవాలు

కొంకణి కథ
గోకులదాస ప్రభు
అనువాదం
రంగనాథ రామచంద్రరావు

ఎంతటి వర్షం! ఆగకుండా రోకటి పోటులా ఒకేవిధంగా ధారగా కురుస్తోంది. రాత్రి ప్రారంభమైన వర్షం ఇంకా ఆగ లేదు. ఇది ఇలాగే కొనసాగితే వరద వచ్చి అంతా మునిగిపోయేలా ఉంది. వర్షం ఒక సారి ఆగితే బాగుంటుంది. బాబు వస్తు న్నాడు. అతను గుమ్మం లోపల కాలుపెట్ట కుండా మూడేళ్లు గడిచాయి. పోయిన సంవత్సరం రావచ్చు, రావచ్చు అని చెప్ప టం మాత్రమే. అయితే రానేరాలేదు. దాని కిముందు సంవత్సరం కూడా అలాగే జరి గింది. ఎందుకు రాలేదని అడిగితే పనీ ఒత్తిడి అంటాడు. సెలవులు దొరకనటు వంటి, ప్రాణాలు ఫణంగా పెట్టి చేసే పనీ అంటూ ఏమిటో? ఏ కారణంగా సెలవు దొరకదో ఆ దేవుడికే తెలియాలి!

అతని తండ్రి కూడా ఇలాగే చేసే వాడు. ఉదయం లేచి వెళితే ఇంటికి తిరిగి వచ్చేసరికి రాత్రయ్యేది. అదే బుద్ధికొడుకు కు వచ్చింది. ఏ పని చేబట్టినా ప్రాణాలు ఫణంగా పెట్టి దాన్ని పూర్తిచేస్తాడు. అటు తరువాత సర్దుకునేవాడు. చదువుకునేట ప్పుడూ అలాగే ఉండేవాడు. ఇతర పిల్ల లంతా కేకలు వేస్తూ, అల్లరిచేస్తూ, పెద్ద గొంతుకతో చదువుతుంటే, వీడు మా త్రం తన బల్ల దగ్గర కూర్చుని నోరు తెరవకుండా, పూర్తిగా అందులో లీన మై చదువుకునేవాడు. అయితే అప్పట్లో గోళ్లుకొరికే అలవాటు వీడికి ఉండేది. గోళ్లుకొరుకుతూ, కటకటమని సద్దు చేస్తూ, అది అతడికి తెలుసో.లేదో? అప్పుడు తల్లి తినటానికి వేయించిన శనగగింజలో, లేదా ఇంకేదైనా చిరు తిండో పెట్టేది. ఇలా చెబుతున్న ప్పుడు గుర్తుకు వస్తోంది. బాబుకు రొయ్యలు, కొరమీను చేపలంటే పంచప్రాణాలు. అయితే వాటి వాస న అంటే పడేదికాదు. బాబు ఈ రోజు వస్తున్నాడని చేపలమ్మే అమ్మికి చెప్పాను. ఆమె పెద్దకొర మీను, రొయ్యలు, పీతలు తెచ్చిపెట్టింది. మధ్యాహ్నం భోజనంలో రొయ్యలవేపుడు, పీతలకూర, రాత్రికి కొరమీ ను వండాలనుకున్నాను.

రొయ్యలను విడిపించి పెట్టాలి. దాంతో పాటు పీత లను కడిగిపెట్టాలి. ముక్క లు చేసి పెట్టవచ్చు. అయి తే కళ్లు సరిగ్గా కనిపించ వు కదా? కంటికి పొర వచ్చి నాలుగేళ్లు అయ్యా



అందరూ-' ఆపరేషన్ చేయించుకో, ఆప రేషన్ చేయించుకో' అని అంటారు. చెప్ప టం సులభం. అయితే అనుభవించేది ఎవ రు? ఒకవేళ మాయాకు జరిగినట్టు జరి గితే నా గతి ఏమిటి? ఆమె కంటి నుంచి శుక్లాలు తీయటానికి ఆపరేషన్ చేశారు. దృష్టిపోయింది. అటు తరువాత చచ్చే దాకా తడుములాడుతూ తిరిగింది. ఆమె లా గుడ్డిదానిలా బతకాలనే కోరిక నాకు లేదు. అలా ఏమీ జరగదని బాబు చెప్పే వాడు. నాన్నకు ఆపరేషన్ జరగలేదా? ఏమైనా ప్రమాదం జరిగిందా? అని అడిగే వాడు. వాడు ఆపరేషన్‌కు డబ్బు కూడా పంపాడు. ఒకసారి కాదు, రెండుసార్లు డాక్టర్లను కలవటమూ జరిగింది. డాక్టర్లు పరీక్షించి, 'రక్తపు ఒత్తిడి ఉంది. కొన్నాళ్ల తరువాత రండి. అప్పటిదాకా ఈ మాత్ర లు వాడండి' అని మాత్రలు రాసిచ్చా రు. మళ్లీ డాక్టరును కలవవలసిన రోజు దగ్గరికి వచ్చినపుడు జ్వరం వచ్చింది. అలా రెండు,మూడుసార్లు జరగటంతో ప్రాణానికి విసుగు పట్టు కుంది. పాడైపోనీ, ఆపరేషన్ వద్దు, డాక్టరూ వద్దు అనిపించింది. డబ్బు బ్యాంకులోనే ఉండిపోయింది.

ఇంటి పనులకు ఒక ఆడమనిషి దొరకటం మంచిదైంది. ఇప్పటి కాలంలో పనివాళ్ళు ఎక్కడ దొరుకు తారు? ఆడపిల్లలంతా చదువుకోవటా నికి వెళుతున్నారు. చదువుకున్న ఆడ పిల్లలు ఇతరుల ఇంటి పనులకు వెళ్ల గలరా? అదృష్టవశాత్తు ఈమె దొరికింది. పని బాగా చేస్తుంది. ఏ పనిచెప్పినా గబ గబా చేసి ముగిస్తుంది

''అమ్మాయీ, రొయ్యలను విడిపిం చటం అయిందా? పీతలను కడిగిపెట్టు ఆ!'' కళ్లల్లో మసకగా చిత్రం ఏర్పడింది. ఒకటి కాదు రెండు చిత్రాలు. ఎవరో ఇద్ద రు వచ్చినట్టున్నారు. బాబు, అతని భార్య అయివుండొచ్చు. దూరం నుంచి ఏమీ కనిపించదు. దగ్గరికి వెళ్లాలి.

''ఎవరు?''. దగ్గరికి వెళ్లినపుడు తెలి సింది- వచ్చింది నా పెద్దకూతురని! ఆమె ఇక్కడికి పదునాలుగు మైళ్ల దూరంలోని ఊళ్లో ఉంటుంది. బాబు వస్తాడని తనకు నేనే కబురు పెట్టాను.

''శాంత కదూ? బాబు వచ్చాడని అనుకున్నాను'' అంది. ఆమె నవ్వుతోంది. ఆమె పెదవులు కదులుతున్నాయి. ఏదో చెబుతున్నట్టు ఉంది. దరిద్రపు చెవులు. ఆమె పెదవుల దగ్గరికి వెళితేనే వినవచ్చు.

''ఏమంటున్నావే?''

సాధన వల్ల సాధించలేనిది లేదు ●

''నీకు బాబు గురించే ధ్యాస. మా గురించి పట్టదు'' అంది గట్టిగా.

''అలా ఏమీలేదు. మీఆయనెక్కడ?''

''మధ్యాహ్నం రావచ్చు''

''ఇంకా ఎవరు వచ్చారు? కూతురా? కొడుకా?''

''కొడుకు వచ్చాడు. వాళ్ల తాతయ్య దగ్గర ఉన్నాడు చూడూ''. అవును కదా, పిల్లవాడు ఎత్తుగా పెరిగాడు. కొబ్బరిచెట్టులా పల్చగా, పొడుగ్గా, నేను శాంతను అడిగాను-

''ఎందుకే ఇలా ఉన్నాడు? కడుపునకు ఏమీ తినడా? కాళ్లూ చేతులూ చూడు, కట్టెపుల్లల్లా ఉన్నాయి''

''వాణ్ణే అడుగు, కంచంలో వడ్డించింది వాడికి అక్కర్లేదు. ఉదయం, సాయంత్రం మ్యాగీనూడుల్స్ తింటాడు. చాయ్, కాఫీ వద్దంటేపోనీలే అనుకోవచ్చు.అయితే పాలు కూడా తాగడు. పాలలో బూస్ట్ మాల్ట్- ఇలా అన్నీ ప్రయత్నించి చూశాను. కొంచెం తాగి'వద్ద'ని వదిలేస్తాడు''

ఈనాటి కాలం పిల్లల బుద్ధి ఏమిటో అర్థంకాదు. వాళ్లకు ఫలహారం, భోజనం మాత్రంవద్దు. చిన్నతనంలో బాబు కూడా ఇలాగే ప్రవర్తించేవాడు. పాలు వేడిగా ఉంటే తాగేవాడు కాదు. అటు తరువాత అది చల్లబడి, పైన మీగడ కట్టి తాగేటప్పుడు మీగడ నోట్లోకి వస్తే వాంతి చేసుకునేవాడు. తరువాతి కాలంలో బయటి ఊళ్లో చదువుకోవడం మొదలుపెట్టినప్పటి నుంచీ అంతా మారింది.

''కూతురిని పిల్చుకుని రాలేదా?''

''పిల్చుకుని రావడానికి అదేమైనా చిన్నపిల్లనా? కాలేజీలో చదువుతోంది. నాలుగైదు నెలల్లో దానిచదువూ పూర్తవుతుంది''

''తరువాత ఏం చేయాలని?''

''తరువాతది తరువాత చూసుకుంటే సరిపోతుంది''

''ఊఁ!''

''ఎలాగో బాబు వస్తాడు కదా, వాడినీ విచారించి చూద్దాం. వాడేమీ సలహా ఇస్తాడో? ఎక్కడైనా ఒక మంచి ఉద్యోగం వెదికి...అదిసరే నీ మెడలోని దండ ఏమైందే శాంతా?''

''అదీ....''

''వాడు దాన్నీ తీసుకెళ్లి అమ్మాడా?''

''లేదు...లేదు...అమ్మలేదు...కుదువపెట్టారు. నేనే ఇచ్చాను. వ్యాపారం చాలా మందకొడిగా నడుస్తోందట.ఎలాగైనా రోజులు గడపాలి కదమ్మా?''

అయ్యో,నీతలరాత!ఒక్కనాటితో తీరేది కాదు. బయట ఎవరో వచ్చినట్టున్నారు.

''ఎవరది?''

''దేవక్క''

''దేవకి, ఇక్కడికి రా. నువ్వు వచ్చి చాలా రోజులు అయింది కదా?''

''అవును. ఒకటి రెండుసార్లు ఇక్కడికి రావాలనే బయలుదేరాను. అయితే కాళ్ల నొప్పులు మొదలయ్యాయి. దుప్పటి కప్పుకుని ఊరికే పడుకుందామని అనిపిస్తోంది''

''వర్షాకాలపు రోజులు. జాగ్రత్త ఉండాలి సుమా''

''బాగున్నావా శాంతా?''

''ఊఁ! దేవుడి దయవల్ల బాగున్నాను''

''ఎప్పుడు వచ్చావు?''

''ఇప్పుడే వచ్చాను''

''దేవకి, ఈరోజు బాబు వస్తాడు''

''ఎప్పుడు?''

''ఇప్పుడేరావచ్చు. పనిమనిషి ఏం చేసిందో తెలియదు.నేనువెళ్లి చూసి వస్తాను''

''పదా నేనూవస్తాను. అక్కడే కూర్చుని మాట్లాడుకుందాం.

❋❋❋

కొద్దిసేపటికి మునుపు పెద్ద కోలాహలాన్ని రేపిన ఇల్లు ఇప్పుడు జాతర ముగిసిన దేవాలయం ఆవరణలా ఉంది. బాబు, అతని తండ్రి పెద్ద నవ్వులు, అతని భార్య, శాంత ఉత్సాహంతో కూడిన మాటలు, పిల్లల ఆటలు, కేరింతలు, మూడేళ్ల తరువాత మొత్తంగా చూసే అవకాశం. తండ్రీ కొడుకులు ముందు గదిలో కూర్చుని ఉన్నారు.



వాడితో మనస్సు విప్పి మాట్లాడటానికి కుదరనేలేదు. వాడైనా ఎందుకు మాట్లాడలేదు? నువ్వు ఎలా ఉన్నావు? ఆరోగ్యంఎలాఉంది? మందులు వేసుకుంటున్నావా? - ఇలా ఏదీ అడగనే లేదు కదా? బహుశా వాడు అడిగాడేమో? నాకు వినిపించకుండా పోయుండవచ్చు.

బాబే ఎక్కువగా మాట్లాడుతున్నాడు. మూడు సంవత్సరాల కబుర్లు కదా? మాటలు ఇప్పట్లో ముగిసేలా కనిపించలేదు. భోజనానికి నాలుగైదుసార్లు పిలవాల్సి వచ్చింది. భోజనం చేసేటప్పుడూ మాట్లాడుతూనే ఉన్నాడు.

మూడేళ్ల తరువాత, అదీ ఎంతో దూరంనుంచి వచ్చారు. కనీసం రెండు రోజులైనా ఉంటారనుకున్నాను. అయితే కళ్లారా చూసుకోవడానికి కూడా కుదరలేదు. భోజనం తరువాత గంటసేపు ఉన్నారు. తరువాత లేచి బయలుదేరారు. తిన్నది గొంతులో దిగిందో,లేదో? వెంటనే బయలుదేరారు. అయిదు వందల కిలోమీటర్ల దూరంలో ఎక్కడో ఎవరినో కలవాలట. సమయానికి రైలుఎక్కాలట. లేచారు. వెళ్లిపోయారు. పిల్లలు సాగిస్తున్న ఈ సంసారం ఏవిధమైందో నాకు అర్థం కాలేదు. కోడలు చెప్పినదాని ప్రకారం బాబు ఉదయం వెళ్లినవాడు ఇంటికి తిరిగి వచ్చేసరికి రాత్రి పదకొండు గంటలవుతుందట. ఆదివారం కూడా ఇంట్లో ఉండడు. పళ్లు తోముకునేటప్పుడూ, ఫలహారం తీసుకునేటప్పుడూ చేతిలో వార్త పత్రిక పట్టుకుని కూర్చుంటాడట. జీవితం అంటే ఇలాగే ఉంటుందా?

అయితే ఒక విషయంలో ఆనందంగా ఉంది. శాంతకు వాళ్లతో మాట్లాడే అవకాశం అయినా దొరికింది. ఆమె కూతురికి ఉద్యోగం ఏర్పాటుచేస్తానని బాబు చెప్పాడట. దేవకి కూడా తాను అతడితో మాట్లాడానని చెప్పింది. నా దగ్గర మాత్రం మాట్లాడటానికి రానేలేదు. భోజనానికి కూర్చున్నప్పుడు ఒకటి రెండు మాటలు. అంతే. వాటికి సమాధానాలు చెప్పటానికి మునుపే వేరే ఎవరో మాట్లాడారు. వాడితో మనస్సు విప్పి మాట్లాడటానికి కుదరనేలేదు. వాడైనా ఎందుకు మాట్లాడలేదు? నువ్వు ఎలా ఉన్నావు? ఆరోగ్యం ఎలాఉంది? మందులు వేసుకుంటున్నావా? - ఇలా ఏదీ అడగనే లేదు కదా? బహుశా వాడు అడిగాడేమో? నాకు వినిపించకుండా పోయుండవచ్చు. మనస్సుకు బాధగా ఉంది. అయితే నా చెవుల విషయం చెప్పటానికి రాదు. అవును...వాడు నన్ను చూస్తూ కూర్చున్నాడు. వాడి పెదవులు కదులుతున్నాయి. ఏదో విన్నట్టు అనిపించింది. దరిద్రపు చెవులు...దరిద్రపు చెవులు...

అయినా లోపల ఎక్కడో గుచ్చుకుంటోంది.

**అనువాదకుని సెల్ నెం. 0000000**

● ఆధ్యాత్మికత లేని విద్య, వాసన లేని పువ్వు లాంటిది



# మేఘాలను చీల్చే రైలు

**చు**క్‌చుక్ రైలు వస్తోంది. ఆగినంకా ఎక్కండి. జోజో పాపా ఏడవకు. లడ్డూ మిఠాయి తినిపిస్తా అని పిల్లలు గీతాలు ఆలపించడం విన్నాం. చూశాం. కానీ మేఘాలను చీల్చుకుంటూ వెళ్లే రైలును మాత్రం మనమెవ్వరం చూడలేదు. కలలో మాత్రం చూస్తేచూడొచ్చు. నిజజీవితంలో ఈ దృశ్యాన్ని స్వయంగా వీక్షించే రోజులొచ్చాయంటే ఆశ్చర్యంగా ఉంది కదూ! సర్వసాధారణంగా మనం రైలును పెద్ద బ్రిడ్జి మీది నుంచి వెళ్లడం, ఏదేనీ టన్నల్ నుంచి వెళుతున్నప్పుడు చూసి ఉండొచ్చు. ఇక్కడ అలా జరగడం లేదు. రైలు ఏకంగా ఆకాశహర్మ్యాలను తాకుకుంటూ వెళుతుంది. మేఘాలపై నుంచి వెళుతుంది. ఇది తమాషా కాదు. వాస్తవం. అర్జెంటీనా వెళితే ఈ అనుభవాన్ని మనం ప్రత్యక్షంగా అనుభవించవచ్చు. సముద్ర ఉపరితలానికి 4వేల మీటర్ల ఎత్తులో ఉండే పర్వతశ్రేణుల్లో ఈ రైల్వేట్రాక్ నిర్మించారు. నాలుగువైపులా రైలు మేఘాలను తాకడం వల్ల పర్యాటకులు ఈ రైలు ప్రయాణాన్ని అమితంగా ఇష్టపడతారు. ఈ రైలుకి ''ట్రైన్ టు ది క్లౌడ్'' అనే పేరు పెట్టారు. ప్రపంచంలోనే అతి ఎత్తయిన రైలు మార్గం ఇదే అని రికార్డుల్లో నమోదైంది. రైలు ఎత్తయిన పర్వత శ్రేణుల మీది నుంచి వెళుతుండగా మేఘాలను చీల్చుతున్న అనుభూతి పొందవచ్చు. ఈ రైల్వే మార్గాన్ని 1920లో నిర్మించారు. అమెరికా ఇంజినీర్ రిచర్డ్ ఫోంటేన్ డిజైన్ చేశారు. 16 గంటల్లో 217 కిలోమీటర్ల వేగంతో ఈ రైలు ప్రయాణిస్తుంది.



# సైనికుల కోసమే జీన్స్ తయారీ

**ఏ**దేని అమ్మాయి లేదా అబ్బాయిని నెలలో జీన్స్ ఎన్నిసార్లు ఉతుకుతారు అని ప్రశ్నిస్తే జీన్స్‌ని ఉతకడానికి కాదు తొడుక్కోవడానికి అని సమాధానం వస్తుంది. అసలు జీన్స్ సైనికుల కోసం తయారు చేశారు. దీని వల్ల ఉతికే సమస్య ఉత్పన్నం కాదు. అయితే యువత చాలామంది జీన్స్‌ని ఇష్టపడతారు. ఫ్యాషన్ స్టేట్‌మెంట్‌గా మారింది. జీవితంలో భాగమైపోయింది. రెండుమూడు సార్లు తొడిగిన తర్వాత జీన్స్‌ని ఉతకడానికి వేస్తుంటారు. జీన్స్ ఎక్కువకాలం మన్నికగా ఉండా లంటే మాత్రం ఉతకకూడదు. జీన్స్ కొన్న తర్వాత ఒక సంవత్సరం ఉతకకూడదు అని చేస్తున్న ప్రచారం మాత్రం వాస్తవం కాదు. దీని మీద ప్రఖ్యాత లెవి జీన్స్ సీఈవో వివరణ ఇచ్చారు. జీన్స్ మెటీరియల్‌ని పలుమార్లు ఉతకడం వల్ల పాడవుతుంది. నీళ్లు వృధా అవుతాయి. డెనిమ్ జీన్స్ పాడవకుండా ఉండాలంటే మాత్రం ఎక్కువ సార్లు ఉతకకూడదని డెనిమ్ ఎక్స్‌పర్ట్‌లు అంటున్నారు. డెనిమ్ బ్లూ జీన్స్‌ని ఎక్కువ సార్లు ఉతకడం వల్ల ఇందులో ఉండే బ్లూ రంగుషేడ్ అవుతుంది.

# ఒకేచెట్టు 40 రకాల పండ్లు



**ఈ** సృష్టిలో ఒకచెట్టు ఉంది. అది విచిత్రమైంది. ఒకటి కాదు, రెండు కాదు, మూడు కాదు మొత్తం 40 రకాల పండ్లు ఒకే చెట్టుకి పండుతాయి. కానీ ఎప్పుడైనా మీరు ఇటువంటి చెట్టు గురించి వినరు. వేర్వేరు రకాల పండ్లు ఒకే చెట్టుకి పండటం వినడానికి ఆశ్చర్యంగా అనిపిస్తుంది. దీన్ని కళ్లారా చూడాలంటే మాత్రం అమెరికాలోని ఒక విజువల్ ఆర్ట్స్ ప్రొఫెసర్ ఈ అద్భుతాన్ని సృష్టించాడు.'' ట్రీ ఆఫ్ 40'' అనే పేరుతో ఇది చాలా పాపులర్.

అమెరికా సెరక్యూజ్ విశ్వవిద్యాలయంలో విజువల్ ఆర్ట్స్ ప్రొఫెసర్‌గా పనిచేస్తున్న వార్న్ ఏకేన్ అనే ఈ చెట్టును సృష్టించాడు. ఇప్పుడు దీని ఖరీదు 19 లక్షల రూపాయలు. 2008లో ఈ ప్రొఫెసర్ న్యూయార్క్ స్టేట్ అగ్రికల్చర్ ఎక్స్‌పెరిమెంట్‌లో ఒక తోటను చూశాడు. 200 రకాల రేగుపండ్లు, ఖుర్బానీకా మీఠా చెట్లు అక్కడ ఉన్నాయి. ఆర్థిక కారణాల వల్ల ఈ తోటను తీసివేయాలనుకున్నారు. ఈ తోటలో అత్యంత ప్రాచీన, అరుదైన చెట్లు చాలా ఉన్నాయి. వ్యవసాయ కుటుంబం నుంచి వచ్చిన ఈ ప్రొఫెసర్ తోటను లీజుకు తీసుకున్నాడు. సాంకేతికత జోడించి ఈ తోటలో ట్రీ ఆఫ్ 40 ని సృష్టించాడు.

# కరోడ్‌పతి కోడి



**అ**దృష్టం వరిస్తే మానవమాత్రులకే కాదు పశు పక్ష్యా దులను కోటీశ్వరులను చేస్తుంది. కారు, బంగ్లా వంటి సౌకర్యాలన్నీ అవి పొందగలుగుతాయి. అవి ఎలాగో ఇప్పుడు చద వండి. మీరు అక్షయ్ కుమార్ ఎంటర్‌టైన్‌మెంట్ సినిమాను చూసే ఉంటారు. అందులో ఒక కుక్క మిలినియర్ అవుతుంది. అటువంటి తరహానే ఇది. తేడా ఏమిటంటే ఇక్కడ కుక్కకు బదులుగా కోడి వచ్చి చేరింది. అదృష్టం కేవలం మానవమాత్రులకే కాదు అని రుజువయిన సందర్భమిది. ఇవ్వాళ మీరు ఒక విచిత్రమైన కోడిని పరిచయం చేసుకోబోతున్నారు. ఆ కోడి వద్ద కోట్లాది రూపాయల సంపద మూలుగుతుంది. అంటే ఈ కోడి బంగారు గుడ్లు పెడుతుందని అనుకుంటే పప్పులో కాలేసినట్టే. ఈ కోడి బంగారు తివాచీ మీద పడుకుంటుంది. ఈ కోడి వద్ద పనివాళ్ల నుంచి మొదలుకొని పెద్దపెద్ద పడవకార్లు ఉన్నాయి. ఈ కోడికి స్వంతంగా సెక్యూరిటీ గార్డ్ ఉంది. దీని పేరు గిగు. గిగు వద్ద ఒక కోటి డాలర్లు అంటే భారతీయ కరెన్సీలో అక్షరాల 66 కోట్ల 95 లక్షల రూపాయలు ఉన్నాయన్నమాట. కారు, బంగ్లా, రాజభోజనం వంటి భోగాలను అనుభవిస్తున్న గిగు ఇప్పుడు వారసత్వంగా ఆస్తిని సంక్రమించుకుంది. తన ఇద్దరు యజమానులు రాసిన వీలు నామా ప్రకారం వారి యావదాస్తి ఈ కోడికే చెందుతుంది. తాము చనిపోయిన తర్వాత గిగుకు ఎటువంటి ఇబ్బందులు రాకూడదన్న ఉద్దేశ్యంతో యజమానులు ఈ వీలునామా రాసారు. దీంతో ఈ కోడి ప్రపంచంలోనే అతిసంపన్న కోడిగా రికార్డుల్లోకెక్కింది.

- బి. శ్రీనివాసాచారి

ఎవరి గొప్పను వారు చెప్పుకోరాదు. లోకం చెప్పుకోవాలి •

# మాదిరాజు-పేర్రాజు




వుంకినపురంలో మాదిరాజు, పేర్రాజు అనే ఇద్దరు యువ రైతులు ఉండేవారు. వారి తండ్రులు ముసలివారయ్యాక వ్యవసాయం పూర్తిగా వారి చేతుల్లో కొచ్చింది. ఎలాగైనా మంచి పంటలు వేసి పండించి అధిక లాభాలు త్వరగా పొంది తమ శక్తియుక్తులు నిరూపించుకోవాలని వారి తపన. ఎవరికి వారే బాగా ఆలోచించి, వ్యవసాయం మొదలుబెట్టారు. పూర్వం తండ్రి కూరగాయలు పండించిన పొలంలో మాదిరాజు అరటితోట వెయ్యాలని సంకల్పించాడు. పేర్రాజు మాత్రం తన తండ్రి పొలంలో సగభాగంలో మాదిరాజులా అరటితోట వేశాడు. మిగతా సగంలో కొబ్బరి మొక్కలు కేరళ నుంచీ తెచ్చి నాటాడు. అది చూసి మాదిరాజు నవ్వాడు. ''పేర్రాజు! ఏంటయ్యా! త్వరగా కాపుకొచ్చి సొమ్ము చేతికి తెచ్చే అరటి తోట సగమే వేసి, ఎప్పటికో దిగుబడి కళ్లజూసే కొబ్బరి మొక్కలు సగం పొలానికి నాటి తిక్క పని చేశావ్!'' అన్నాడు. దానికి పేర్రాజు నవ్వి ''ఏదోలే నా పిచ్చి నాది'' అని తేల్చేశాడు. కొద్దికాలం అలా సాగింది. ఇద్దరికిద్దరూ వారి తోటల్లో కష్టపడి పనిచేయసాగారు. ఇద్దరి అరటి తోటలు కాపుకొచ్చాయి. ఇద్దరూ పండ్లు చెట్లకే దాదాపు పండనిచ్చి, కోతకోయించి గెలలను బండ్లమీద అమ్మకానికి నగరానికి తీసుకెళ్లారు. ఇద్దరి పండ్లూ మేలిరకంగా ఉండటాన సులువుగానే అమ్ముడయ్యాయి. మాదిరాజుకు వచ్చిన సొమ్ములో సగభాగమే పేర్రాజుకు వచ్చింది. ''ఏం పేర్రాజు! నా దిగుబడి సొమ్ము చూశావా! నీకంటే రెట్టింపు! నీవూ నా మాట విని మొత్తం అరటితోట వేసి ఉంటే నీకూ ఇంత సొమ్ము చేతికొచ్చేది కదా?'' అన్నాడు.

''పోన్లే మాదిరాజు! నా పిచ్చి నాది'' అని తేల్చేశాడు పేర్రాజు. మాది రాజు దిగుబడి బాగుండి సొమ్ము దండిగా చేతిలో పడటంతో కొన్నాళ్లు కాస్తంత విశ్రాంతిగా ఉన్నాడు. పేర్రాజు మాత్రం తన కొబ్బరిచెట్ల బాగోగులు చూసుకుంటూ గెలలు కోసేశాక ఉన్న అరటితోటలను కూడా అమ్ముకుని, పిలకలను తిరిగి నాటుకుంటూ వర్షాలకోసం చూడసాగాడు. అదునుకు వానలు పడగానే కొట్టేసిన బోదల స్థానంలో కొత్త అరటి పిలకలు, నాటి తిరిగి తన రెండు తోటలూ చూసుకోసాగాడు. మాదిరాజు కాస్త ఆలస్యంగానైనా అరటి పిలకలు నాటించి తోట సాగు చేసుకోసాగాడు. ఆ ఏడాది అనుకోని చీడ పీడలు అంటుకుని అరటితోట పాడైపోయింది. పేర్రాజు అరటి తోటలకు మందులు కొడుతూనే, వేసవిలో బాగా గిరాకీ ఉన్న కొబ్బరి బోండాలు దింపించి నగరంలో అమ్మాడు. నీళ్లు బావుండటాన పేర్రాజు చేతిలో సొమ్ము గలగలలాడింది. ఆ సొమ్ము పెట్టి అరటి తోటకు మంచి ఎరువూ చీడ మందూ వేయిస్తూనే ముదిరి దిగుబడికొచ్చిన కొబ్బరికాయలు కూడా దింపించి నగరంలో అమ్మకానికి పెట్టాడు. అన్నీ బాగానే అమ్ముడయ్యాయి. ఆశించిన దానికంటే అదనంగానే సొమ్ము కూడింది. పేర్రాజుకు చీడతో ఎదగక పంట చేతికందక దిగులుపడ్డ మాదిరాజును చూసి ''మాదిరాజు! ఒకే పంటమీద మనసు పెట్ట కూడదయ్యా! రెండూ వేసుకుంటే ఒక పంట చేతికి రానపుడు రెండో దాని మీద సర్దుకోవచ్చు'' అన్నాడు. దానికి ''నిజమేనయ్యా! నిన్ను తెలివి తక్కువ వాడివనుకున్నా. నేనే తెలివితక్కువ వాడిని. నాదే తెలివి తక్కువ నిర్ణయం. నేనూ ఇహ మీదట నీలాగే రెండు పంటలు వేస్తానయ్యా! అన్నాడు. 'నా సహకారమూ నీకుంటుంది అన్నట్టు పేర్రాజు మాది రాజు భుజం తట్టాడు స్నేహపూర్వ కంగా.

- హైమా శ్రీనివాస్

## కనుక్కోండి చూద్దాం!

ఒక చిన్న పార్టీ క్లీనింగ్‌కి సీత, గీతని ప్లేట్స్ గిన్నెలు కడిగే పనిలో నియమించారు. సీత మూడు నిమిషాలలో 8పేట్లయినా గిన్నెలైనా కడగగలదు. అదే గీత 5 నిముషాలలో 11 పేట్లయినా గిన్నెలైనా కడగగలదు. మూడు గిన్నెలకైనా 3 ప్లేట్లకైనా ఒక రూపాయి ఇస్తామన్నారు. ఆరోజు ఇద్దరు కలసి 73 రూపాయలు సంపా దించారు. ఇద్దరు ఎన్ని నిముషాలు పని చేసారు. మొత్తం ఎన్ని కడిగారు? ఒక్కొక్కరు ఎంత సొమ్ము పొందారు?

- చామర్తి వెంకట రామకృష్ణ

జవాబు: 73X 3= 219 కడిగారు. (219X15/73=45) ఇద్దరు 45 నిముషాలు పనిచేసారు. సీత 120 కడిగింది. గీత 99 కడిగింది సీతకి 40 రూపాయలు, గీతకి 33 రూపాయలు పొందారు.

● మనో నిర్మలత పవిత్రమైన దేవాలయం లాంటిది



# తేడాలు గుర్తించండి



పిల్లలూ! పైనున్న రెండు ఫొటోలలో కొన్ని తేడాలున్నాయి. అవేమిటో కనుక్కోగలరేమో జాగ్రత్తగా పరిశీలించి చూడండి.



# చుక్కలు కలపండి

| | |
|---|---|
| 1 = | |
| 2 = | |
| 3 = | |
| 4 = | |
| 5 = | |
| 6 = | |
| 7 = | |
| 8 = | |



పిల్లలూ! పైనున్న ఫొటోలో నంబర్లను ఇచ్చిన కలర్స్‌తో నింపితే అందమైన బొమ్మ తయారవుతుంది. ఆ అందమైన బొమ్మను తయారుచేయండి మరి!

# దారిచూపిస్తారా?

START

FINISH



# కనిపెట్టండి!



పిల్లలూ! పక్కనున్న ఫొటోలో వ్యతిరేక పదాలు, ఫొటోలతో సహా ఉన్నాయి. దానికి వ్యతిరేకమైన పదాన్ని ఇచ్చిన సేమ్ కలర్‌తో నింపగలరా!

day, asleep, fast, poor, hard, full

slow, hungry, awake, rich, night, soft

తేడాలు గుర్తించండి జవాబులు: 1. టీ పొగ తక్కుంది. 2. బాబు చేతిలో చికెన్ ముక్క తగ్గింది 3. టి.వి.పై బాక్సులో బటన్స్ తక్కువయ్యాయి 4. అమ్మాయి ప్లేట్ లో స్పూన్ లేదు 5. అబ్బాయి కాలి దగ్గర ఉన్న పేపర్ మీద బోన్ పీస్ లేదు 6. అబ్బాయి హెయిర్ స్టయిల్ లో తేడా ఉంది

నశించిపోయేది భౌతిక సంపద. నిత్యమై నిలిచిపోయేది ఆధ్యాత్మిక సంపద

# ● పదబంధం - 134

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | ★ | 2 | 3 | 4 | | 5 | 6 | ★ |
| | ★ | 7 | | | | ★ | 8 | | 9 |
| 10 | | ★ | | ★ | | ★ | 11 | | |
| | ★ | 12 | ★ | 13 | | 14 | | ★ | |
| 15 | 16 | | 17 | | ★ | | ★ | 18 | |
| ★ | 19 | | | ★ | ★ | 20 | 21 | | 22 |
| 23 | | ★ | | ★ | 24 | | | ★ | |
| 25 | | ★ | 26 | 27 | | ★ | ★ | 28 | ★ |
| | ★ | 29 | ★ | 30 | | | | | 31 |
| ★ | 32 | | | | | ★ | 33 | | |

## ఆధారాలు

**అడ్డం**

1. మూడో మనిషి (2)
2. వట్టికోట ఆళ్వారుస్వామి విశిష్ట నవల (6)
7. 'గుడి' మరోలా చెదిరింది (4)
8. 'నీ' తెలుగులో ఏమంటారు (3)
10. 'లక్ష'ని వికృతిలో చెప్పండి (2)
11. పోయిన సంవత్సరం (3)
13. భిక్షగాడు అటుగా వచ్చాడు (4)
15. పేకాటలో ఆడేవి తిరగబడ్డాయి (5)
19. 'అడవి' ఎదురొచ్చింది (3)
20. పూలు గుడికి తీసుకెళ్లే వస్తువు (4)
23. పోతు (2)
24. ద్వారము (3)
25. బ్యాగు (2)
26. 'లారి' భిన్నంగా వస్తూ అస్తవ్యస్తం (3)
30. ఇదో రకమైన వాడుక పండు. కానీ పండు కాదు. తిట్లల్లో వాడతారు. అటుగా (6)
32. ఒక రకం ధాన్యపు పంట (5)
33. 'తెలుసా?'కి క్వైట్ ఆపోజిట్‌గా అడగండి?(3)

**నిలువు**

1. మనదేశానికి తూర్పున పెట్టని కోటలా నిల్చున్న పర్వతాలు (5)
2. గెలవాలంటే చెయ్యాల్సింది (3)
3. మోట (2)
4. వినాయకునికి ఇష్టమైన పిండి వంటకం కొమ్ము లుప్తంగా పైకి (4)
5. జలుబువల్ల పసిపిల్లలకు వచ్చే వ్యాధి(4)
6. వ్యాహ్యాళి (3)
9. గుండ్రంగా తిరగటం క్రింది నుండి (3)
12. అలనాటి సత్యభామ (3)
13. కట్టెను చీరితే వచ్చే చిన్నముక్క మీదకు (2)
14. ఒకరకమైన తెల్లని ఐదు రేకుల పూలు (4)
16. 'స్మాల్‌పీస్' పైకొచ్చింది (4)
17. ట్విన్స్ (4)
18. కీర (2)
21.'పులకింత' తొలిసగం మాత్రమే క్రిందుగా (2)
22. తస్లీమా నస్రీన్ రాసిన సంచలన నవల పైకెగబాకింది (2)
23. నచ్చుటం (3)
24. వేసవి పంట (4)
27. దీనిలా బతకాలని అంటారు పైకి (3)
28. వర్షాకాలంలో బెకబెకమనేవి (3)
29. ఆవు ఎలాంటి జంతువు (2)
31. 'మైల' యాసలో శీర్షాసనమేసింది (2)

**నిర్వహణ: హుమయూన్ సంఘీర్**

**పదబంధం 133 - సమాధానాలు**

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 స | రో | 2 గ | 3 సీ | ★ | 4 తూ | 5 ని | 6 కా | 7 కు | ★ |
| వ | ★ | 8 తం | బా | కు | ★ | 9 వు | క | ల | ప |
| 10 ర్ణ | వ | ★ | లి | ★ | 11 బీ | రు | ర | మ్మ | ★ |
| దీ | ★ | 12 అ | క్ | 13 టా | ★ | ★ | కా | ★ | 14 ఆ |
| 15 ర్ష | దీ | సు | ★ | 16 త | 17 డు | ★ | 18 య | 19 వ్వ | నం |
| సం | ★ | 20 ర | 21 పా | వు | ము | ★ | ★ | 22 ర | ద్ |
| 23 ధి | 24 బం | ★ | 25 ల | డ్ | కా | ★ | 26 ప | ★ | ★ |
| ★ | డ | ★ | క్ | ★ | ★ | 27 ప | రి | 28 ణ | 29 తి |
| 30 రు | బా | 31 బు | ★ | 32 ఊ | 33 ర | ★ | 34 ణ | రా | చా |
| 35 గు | బు | రు | ★ | 36 క | వి | త్ర | యం | ★ | పం |

● కర్మ చేయలేక కర్తవ్యం నుండి తప్పుకొనువారు సోమరులు, పామరులు



## మొట్టమొదటి విశ్వవిద్యాలయం

● క్రీ.పూ. 700సం.ల కిందటే తక్షశిల మొట్ట మొదటి విశ్వ విద్యాలయం గా అవతరించిందట.

●గాంధీ జీవిత చరిత్ర ఆధారంగా నిర్మించిన 'గాంధీ' చిత్రంలో గాంధీజీ అంత్యక్రియల సన్నివేశంలో సుమారు మూడు లక్షలమంది పాల్గొన్నారట.



## అతి పెద్ద క్రికెట్ మైదానం

● అతి పెద్ద క్రికెట్ మైదానం ఇండియాలో హిమాచల్ ప్రదేశ్ లోని ఛైల్ ప్రాంతంలో ఉంది. ఇది 2,444మీటర్ల విస్తీర్ణంలో ఉంది.

●అతి పెద్ద రోడ్డు మార్గం కల దేశం భారతదేశమేనట. 109 మిలియన్ల మైళ్ల రోడ్డు మార్గం కలిగి ఉందట.

●సినీరంగంలో ఎక్కువ నిర్మా తలు కలిగిన దేశం మన భారత దేశమేనట.

## రైల్వే ఉద్యోగస్థులు అధికం

● భారతదేశ రైల్వే వ్యవస్థలో ఉద్యోగులు 1.3 మిలియన్ మంది పనిచేస్తున్నారట. ఈసం ఖ్య చాలా చిన్నదేశాల జనాభా కంటే ఎక్కువట.

●ప్రపంచంలో అన్నిదేశాల కంటే ఎక్కువగా ఇంగ్లీషు మా ట్లాడే ప్రజల సంఖ్య భారత దేశంలోనే ఎక్కువట.



## ఉప్పు చెరువును చూసారా!

● ఉప్పునీళ్లంటే సముద్రమనే అందరూ ఆలోచిస్తారు. కాని ఉప్పు నీళ్ల చెరువు కూడా ఉం దట. ఇది మహారాష్ట్రలో ఉందని, దీనిని లోనార్ లేక్ అని అంటారని మీకు తెలుసా.

●బటన్స్(చొక్కాలకు పెట్టుకునే) కనిపెట్టింది భారత దేశంలోనే నట.

●చదరంగం ఆట కూడా మొదట ఆడింది భారతదేశంలోనేనట..



## మొట్టమొదటి గ్రానైట్ దేవాలయం?

●మొట్ట మొదటి గ్రానైట్‌రాయితో తయారుచేసిన దేవాలయం తమిళనాడులోని బృహదీశ్వరాలయం. దీనిని 11వ శతాబ్దంలోనే నిర్మించారు.



●సూర్యుని చుట్టూ ఒక్కసారి తిరగడానికి యురేనస్‌కు 84ఏళ్లు పడుతుంది. అంటే అక్కడ పగలు 42 గంటలు, రాత్రి 42గంటలు ఉంటుందన్న మాట!

●ప్రపంచంలో ఎక్కువగా హత్యలు జరిగే దేశం భారతదేశం. ఈ విషయంలో భారతదేశం ప్రథమస్థానంలో ఉందట. ప్రతి సంవ త్సరం 32,719 హత్యలు జరుగుతుండగా, రష్యాలో 28,904 హత్యా లు జరుగుతున్నాయట.

●2006 తర్వాత భారతదేశంలోని బెంగళూరు టెక్నికల్ ఆఫీ సులను విస్తృత స్థాయిలో పెంచిందట. ఇప్పుడు సింగపూర్‌లో కంటే టెక్నికల్ ఆఫీసులు ఎక్కువగా బెంగళూరులోనే ఉన్నాయట.

●భారతదేశపు మొదటి ఉపగ్రహాన్ని ఉపయోగించడానికి తీసు కు వచ్చేటప్పుడు సైకిల్ మీదే తీసుకువచ్చారట. దానిని ఎద్దులబండి మీద పెట్టి మొదటి ప్రయోగం చేశారట.

●







మంచిని శ్లాఘించినట్లే చెడును విమర్శించి ఎదిరించాలి ●

# వారఫలాలు





25-09-2016 నుంచి 1.10.2016 వరకు

- చిర్రావూరి అనంత్

సెల్. నెం. 9440055103



**మేషం: (అశ్వని, భరణి, కృత్తిక 1. పా)**

ప్రజనసహకారం బాగుంటుంది వ్యాపారాలలో అభివృద్ధిని సాధించడానికి అవకాశాలున్నాయి. సమయ పాలన అవసరం. శ్రద్ధాలోపాన్ని సవరించుకునే ప్రయత్నంచేయడం మంచిది. విద్యార్థులు సుఖ ప్రాధాన్యాన్ని తగ్గించుకుని శ్రద్ధను పెంచుకోవలసిన అవసరం ఉంది. "శ్రీ హయగ్రీవాయ నమః" అనే మంత్రాన్ని విద్యార్థులు చేసుకోవడం, తల్లిదండ్రులు విద్యార్థుల కోసం చేయడం మంచిది. ముఖ్యంగా పరీక్ష సమయంలో తల్లి తండ్రులు పిల్లలకోసం ఈ మంత్రాన్ని చేయడం మంచిది.



**వృషభం: (కృత్తిక 2,3,4పా, రోహిణి, మృగశిర 1,2 పా)**

కళాకారులకు విజయావకాశాలు బాగున్నాయి. మీ ఆలోచనలు పలువురికి ఆమోదయోగ్యంగా ఉంటాయి. గురువుల ప్రశంసలను పొందగలరు. వైజ్ఞానికాంశాలపై ఆసక్తి కనబరచువారికి నూతనాంశాలు స్ఫురించే అవకాశం ఉంది. చిన్న చిన్నగాయాలు కావచ్చు. ఆందోళన పడవలసిన అవసరం లేదు. ప్రయాణ సమయంలో "గౌతమ" అనే మంత్రం చేసుకోవడం మంచిది. పనులలో చిన్న చిన్న ఆటంకాలు ఏర్పడవచ్చు.



**మిథునం: (మృగశిర3, 4 పా, ఆర్ద్ర, పునర్వసు1, 2, 3పా)**

సమస్యలను అధిగమించడం కష్టసాధ్యమవుతుంది. వ్యవహారాలలో ఆటంకాలు ఏర్పడవచ్చు. లక్ష్యసాధనలో పట్టుదల పెంచుకునే ప్రయత్నం చేయాలి. స్వలాభాపేక్ష లేనందువలన మాట విలువ బాగుంటుంది. ఆరోగ్య విషయంలో మెరుగుదల ఆలస్యం కావచ్చు. జీవిత భాగస్వామి ఆరోగ్యం విషయంలో శ్రద్ధ అవసరం. "క్లీం అచ్యుతానందగోవింద"అనే మంత్రాన్ని చేసుకోవడం ద్వారా ఆరోగ్యవిషయంలో అనుకూలతను సాధించగలుగుతారు.



**కర్కాటకం: (పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)**

ప్రయాణాలు అనుకూలమైన ఫలితాన్నిస్తాయి. చిన్న చిన్న అసౌకర్యాలు రావచ్చు. ప్రణాళిక బద్ధత తప్పనిసరి. తండ్రి తత్సమానుల సలహాలు, సహకారం స్వీకరించడానికి సిద్ధంగా ఉండాలి. "శ్రీదత్తశ్శరణం మమ" అనే మంత్రం ఆలోచనా విధానాన్ని మెరుగుపరుస్తుంది. ఆర్థిక వ్యవహారాల విషయంలో తగిన జాగ్రత్తలు తీసుకోవాలి. అధిక శ్రమ ఉండవచ్చు. విశ్రాంతి లోపం లేకుండా తగిన జాగ్రత్తలు తీసుకోవడం మంచిది.



**సింహం: (మఖ, పుబ్బ, ఉత్తర 1 పా)**

వాహనాల విషయంలో అసౌకర్యాలు ఎక్కువగా ఉండవచ్చు. ఆకస్మికంగా సంప్రాప్తించిన ధనాన్ని, ఇతరత్రా ఏర్పరచుకున్న ధనాన్ని పెట్టుబడులు పెట్టడానికి తొందరపడి వినియోగించడం శ్రేయస్కరంకాదు. దీర్ఘకాలికమైన ప్రయోజనాల కోసం పెట్టే పెట్టుబడులు కొంత ప్రయోజనాలను అందించడానికి అవకాశం ఉంటుంది. "జనని కనకవృష్టిం దక్షిణాంతేర్పయామి" అనే మంత్రం చేయడం మంచిది. చిన్న విషయాలలో జనసహకారం పొందుతారు.



**కన్య: (ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1,2 పా)**

ఆహారవ్యవహారాలలో దోషాలు రాకుండా జాగ్రత్త పడాలి. వైద్యునితో సంప్రదింపులు అవసరం రావచ్చు. విద్యార్థులు చదువు విషయంలో మరింత శ్రద్ధ పెంచుకోవాలి. విదేశీయానాల విషయంలో అనుకూలత సాధించడం కష్టం. ప్రయత్నాలు వృథా కావచ్చు. చేసే పనులలో ఎక్కువ అసంతృప్తి ఉండవచ్చు. తగిన జాగ్రత్తలతో వ్యవహరించడం మంచిది. "శ్రీరామ జయ రామ జయ జయ రామ రామ" అనే మంత్రం చేసుకోవడం మంచిది.



**తుల: (చిత్త 3, 4 పా, స్వాతి, విశాఖ 1, 2, 3 పా)**

మీ ఆలోచనలలో తగిన మార్పులను తీసుకువచ్చే ప్రయత్నం మంచిది. వాగ్వాదాలు రాకుండా జాగ్రత్తపడాలి. జనసహకారం లభించడం కష్టసాధ్యం. సంతాన వర్గం ప్రవర్తన విషయంలో అశాంతి ఏర్పడవచ్చు. కుటుంబ వ్యవహారాలలో ఘర్షణ లేదా ప్రతికూలతలు ఎదుర్కొనే స్థితి సూచితమౌతున్నందున తగిన జాగ్రత్త తీసుకోవడం మంచిది. "సదాశివ కుటుంబిన్యై నమః" అనే మంత్రం చేసుకోవడం ద్వారా కుటుంబ వ్యవహారాలలో సానుకూలతను పొందగలుగుతారు.



**వృశ్చికం: (విశాఖ 4 పా, అనురాధ, జ్యేష్ఠ)**

ఘర్షణలకు తావులేకుండా పనులను నిర్వర్తించుకునే ప్రయత్నం చేయడం మంచిది. మాటల్లో పొరపాట్లు దొర్లకుండా జాగ్రత్తపడాలి. అవసరానికి తగిన ధనం సమకూరడం కష్టసాధ్యం. విద్యవిషయంలో అశ్రద్ధ పనికిరాదు. విద్యార్థుల అభివృద్ధికి తగిన కృషిని పెంచుకునే ప్రయత్నం అవసరం. గురువుల సహకారం పొందగలుగుతారు. కళాశాలలకు ఆర్థిక ప్రయోజనాలకు, గుర్తింపుకి అవకాశాలున్నాయి. రుణప్రయత్నాలు సానుకూలం అవడం కోసం 'శ్రీ గణేశ ఋణం ఛింధి' అనే మంత్రం చేయండి.



**ధనుస్సు: (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా)**

పట్టుదలతో పనులను పూర్తిచేసుకుంటారు. ఇతరుల నుండి రావలసిన సహకారం సంతృప్తికరంగా ఉండకపోవచ్చు. ఆరోగ్య విషయంలో చిన్న చిన్న సమస్యలను ఎదుర్కోవలసి రావచ్చు. తీవ్రదోషాలు లేకపోయినా త్వరితంగా కోల్కోవడం కష్టం కావచ్చు. 'క్లీం అచ్యుతానంద గోవింద' అనే మంత్రం చేసుకోవడం మంచిది. ప్రణాళికలలో లోపాలు సవరించుకోవడం అత్యవసరం. తొందరపాటుతో ఆర్థిక పరమైన ఇబ్బందులు ఎదుర్కొనే సూచనలున్నాయి.



**మకరం:(ఉత్తరాషాఢ2,3,4, శ్రవణం, ధనిష్ఠ1, 2పా)**

ఆర్థిక విషయాలలో జాగ్రత్త అవసరం. స్థిరాస్తులలో పెట్టుబడులు పెట్టదలచుకున్న వారు వాటికి సంబంధించిన పూర్తిసమాచారాన్ని తెలుసుకుని తగిన అభిప్రాయ సేకరణలతో ముందడుగు వేయడం మంచిది. "శ్రీ వరాహాయ ధరణ్యుద్ధారకాయ నమః" అనే మంత్రం చేసుకోవడం మంచిది. ఉద్యోగ ప్రయత్నాలకు ఫలితాలు ఆలస్యంకావచ్చు. కొంత సమయం వేచి ఉండవలసి వస్తుంది. పరిచయస్తుల ద్వారా చేసే ప్రయత్నాలు సానుకూలం.



**కుంభం: (ధనిష్ఠ3,4, శతభిషం,పూర్వాభాద్ర 1,2,3 పా)**

కుటుంబంలో శుభకార్యాలను చేయడానికి ప్రణాళికలను సిద్ధంచేసుకోగలరు. బంధుమిత్రుల సహకారం లభిస్తుంది. విద్యార్థులకు మంచి గుర్తింపు లభించే సూచనలున్నాయి. ఉన్నత విద్యకోసం ప్రయత్నాలు చేయడం మంచిది. కొత్త కార్యక్రమాలకు శ్రీకారం చుట్టే అవకాశాలున్నాయి. కార్యదక్షతకు తగిన ఫలితాలను పొందగలుగుతారు. "కాలకాలం మహాకాలం కాలాతీతం నమామ్యహం" అనే మంత్రం చేసుకోవడంతో సమయానుసారం పనులు జరుగుతాయి.



**మీనం: (పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి)**

ఉన్నతస్థాయి వ్యక్తులతో సంప్రదింపులు సానుకూలమౌతాయి. లాభాలను దృష్టిలో పెట్టుకుని తగిన జాగ్రత్తలతో పనులు సానుకూలమౌతాయి. విద్యార్థులు కృషికి తగిన ఫలితాలను పొందగలరు. వ్యాపారాలలో లాభాలకు అవకాశాలు బాగుంటాయి. వ్యవహారాలలోనూ, సంప్రదింపులు, చర్చలు సానుకూలమయ్యే అవకాశం. "శ్రీరామ జయ రామ జయ జయ రామ రామ" అనే మంత్రం చేసుకోవడం మంచిది.

# శుభకార్యాల వాయిదాకు కారణం?



చివుకుల
రాఘవేంద్ర శర్మ

*ప్రశ్న : గురువుగారు! మా ఇంట్లో వివాహాలు తరుచూ వాయిదా పడు తున్నాయి. కారణం తెలియడం లేదు. సమస్య ఏమిటో తెలిపి, నివారణ చూపగలరు?*

**జవాబు:** మీ ఇంటికి వాయవ్య దోషం ఉన్నది. అందువలననే శుభకార్యాలు తరుచూ వాయిదా పడుతున్నాయి. దోషనివారణ కోసం సంప్రదించండి. శుభం కలుగుతుంది.

## దేవాలయాల నీడ పడవచ్చా?

*ప్రశ్న : మా ఇంటి మీద దేవాలయం నీడ పడుతుంది. ఈ దేవాలయం ఇటీవల నిర్మాణం చేసారు. అప్పటి నుండి ఏదో ఒక సమస్య మా ఇంట్లో ఉంటున్నది. నివారణ తెలుపగలరు?*

*- ధనుంజయరావు (కరీంనగర్)*

**జవాబు:** దేవాలయాల నీడ అలాగే ధ్వజస్తంభం నీడ కూడా ఇంటిమీద పడరాదు. దీనివలన అనేక సమస్యలు వస్తాయి. దీనికి ప్రత్యామ్నాయ పద్ధతుల ద్వారా పరిష్కారం కలదు. ఒకసారి కలవండి. శుభం.

## భార్యాభర్తల గొడవలకు వాస్తు కారణమా?

*ప్రశ్న : మేము ఒక ఇంట్లో అద్దెకు ఉంటున్నాం. కానీ ఈ ఇంటికి వచ్చిన దగ్గర నుండి భార్యాభర్తల మధ్యన గొడవలు ఎక్కువగా ఉంటున్నాయి? దీనికి కారణం ఈ ఇల్లే అంటారా?*

*- వేణు (అమరావతి)*

**జవాబు:** ఖచ్చితంగా ఈ ఇల్లే అవుతుంది. మీరు నివసిస్తున్న ఇంటికి ఆగ్నేయంలో సెప్టిక్ ట్యాంక్ అలానే ఆగ్నేయంలో మెట్ల క్రిందనే టాయిలెట్స్ ఉన్నాయి. దీనివలననే మీ ఇద్దరి మధ్యన గొడవలు అధికంగా ఉన్నాయి. ఈ ఇల్లు అద్దెదే కాబట్టి మీరు మరొక ఇంటికి మారండి. మీకు అంతా మంచి జరుగుతుంది.శుభం.

## ప్రహరీగోడకు ఆనుకొని నిర్మాణం కట్టవచ్చా?

*ప్రశ్న : మేము కొత్తగా ఇంటి నిర్మాణం చేస్తున్నాం. దీనికి తూర్పులో రోడ్డు ఉన్నది. కానీ మెట్ల నిర్మాణ సమయంలో మెట్లను తూర్పు ప్రహరీగోడకు ఆనించి నిర్మాణం చేయవచ్చా? చేస్తే ఏమైనా దోషాలు ఉంటాయా? తెలుపగలరు?*

*- సుబ్బారెడ్డి (నిజామాబాద్)*

**జవాబు:** చాలామంది చేస్తున్న తప్పు ఇదే. మెట్ల నిర్మాణం చేస్తున్నప్పుడు ఎలివేషన్ కోసం అని మెట్లను ప్రహరీగోడకు ఆనించి నిర్మాణం చేస్తున్నారు. ఇలా చేయడం వలన ఆ దిశలో గల మూల అనగా ఉన్న - మీరు నిర్మిసున్న మెట్ల తూర్పు ఆగ్నేయంలో కలవు. దీనివలన మీ ఇంటికి తూర్పు ఆగ్నేయం పెరుగుతుంది. అలాగే దక్షిణ నైరుతి, పడమర నైరుతి, ఉత్తర వాయవ్యంలో మెట్లు అయితే ఆ దిశలలో ఆ మూలలు పెరగడం జరుగుతుంది. వీటివలన అనేకసమస్యలు వస్తాయి. ఇక మీ ఇంటి విషయానికి వస్తే మీ ఇంటికి తూర్పు ఆగ్నేయం పెరగడం వలన ఇంట్లో నివసించే ఆడవారికి సమస్యలు వస్తాయి. అలాగే దొంగల భయాలు, కేసులు కూడా ఉంటాయి. కాబట్టి తూర్పు ప్రహరీగోడకు తగలకుండా మెట్ల నిర్మాణం చేయండి. మీకు అంతా శుభం జరుగుతుంది.

## వ్యాపారాభివృద్ధి మార్గం?

*ప్రశ్న : మేము హోటల్ నడుపుతుంటాం. కానీ అనుకొన్నంతగా వ్యాపారం జరగడం లేదు. ఎందువలనో అర్థం కావడం లేదు. దీనికి పరిష్కారం తెలుపగలరు?*

*- శ్రీధరరావు (కర్నూలు)*

**జవాబు:** మీరు వ్యాపారం నిర్వహిస్తున్న స్థలానికి కొన్ని దోషాలు ఉన్నాయి. అందువలనే ఇలా జరుగుతున్నది. మీ వ్యాపారం మూడు పువ్వులు, ఆరు కాయలుగా సాగాలి అంటే ఒకసారి సంప్రదించండి. మీ వ్యాపారం లాభాల బాటలో పయనించడానికి కొన్ని సూచనలు చేస్తాను.

## స్థలం విక్రయంలో సమస్యలు?

*ప్రశ్న : మేము మా స్థలాన్ని అమ్మాలనుకొంటున్నాం. కానీ చాలా మంది వస్తున్నారు. చూసి పోతున్నారు. మా స్థలం అమ్ముడు కావడానికి పరిష్కారం తెలుపగలరు?*

*-పద్మావతి (హయత్‌నగర్)*

**జవాబు:** మీ స్థలానికి కొన్ని దోషాలు ఉన్నాయి. అందువలనే మీ స్థలం అమ్ముడు కావడం లేదు. దీనికి సంబంధించి యంత్రం ద్వారా పరిష్కారం కలదు. అది చేసుకొన్న తర్వాత మీ స్థలం అమ్ముడు అవడం జరుగుతుంది. ఒకసారి సంప్రదించండి. శుభం.

## కాంప్లెక్స్ నిర్మాణంలో లోపమా?

*ప్రశ్న : గురువుగారు. నేను ఇటీవల ఒక కమర్షియల్ కాంప్లెక్స్ నిర్మించాం. కానీ చాలా మంది వస్తున్నారు. చూసిపోతున్నారు. అద్దెకు ఎవరూ రావడం లేదు. ఎందువలననో అర్థం కావడం లేదు. మీరు దీనికి పరిష్కారం చూపి ఈ కాంప్లెక్స్‌లోకి అద్దెకు వచ్చేలా చేయగలరని ఆశిస్తున్నాం?*

*-సిద్ధార్థ (వైజాగ్)*

**జవాబు:** మీరు పంపిన ప్లాన్ పరిశీలించాం. ఉత్తర వాయవ్యంలో దోషాలు ఉన్నాయి. అలాగే నైరుతిలో కూడా దోషాలు ఉన్నాయి. అందువలననే ఇలా జరుగుతున్నది. ముందుగా ఆ దోష నివారణ చేసుకోండి. మీ కాంప్లెక్స్‌లోకి అద్దెకు వస్తారు. ఆ దోష నివారణల కోసం సంప్రదించండి. శుభం.

## ఈశాన్యంలో బెడ్‌రూమ్ ఉండవచ్చా?

*ప్రశ్న : ఈశాన్యంలో గల బెడ్‌రూం వివాహం అయిన జంట వాడవచ్చా?*

*-ప్రేమ్‌రావు,(గుంటూరు)*

**జవాబు:** ఈశాన్యంలోగల బెడ్‌రూం వివాహం అయిన జంట వాడరాదు. ఇందులో ఉన్నంతకాలం ఇద్దరి మధ్యన కీచులాటలు, ఒకవేళ గర్భవతి అయినట్లయితే ఆ గర్భం పోవడానికి కూడా అవకాశం కలదు.

●

వాస్తుశిఖామణి, వాస్తురత్న **చివుకుల రాఘవేంద్ర శర్మ**
ప్లాట్.నెం. 63, రోడ్ నెం.1, , టి. నగర్
చెన్నై షాపింగ్‌మాల్‌కి ఎదురుగా , డా. ఎ.ఎస్.రావ్ నగర్,
సికింద్రాబాద్- 062
సెల్.నెం. 9642706128, 9291805128,
ఇమెయిల్: sampadhavasthu@gmail.com

ఒకటిగా చేసేది 'ప్రేమ'. విభజించి ఆనందించేది 'ద్వేషం' ●

